డిశంబరు 1993
సంపుటి : 9
సంచిక : 12

శ్రీవాణి
సాంస్కృతిక మాసపత్రిక
సంపాదకుడు-కొమరగిరి కృష్ణమోహనరావు

మేనేజర్
కొమరగిరి చంద్రశేఖర్
24-52, రామానాయుడు పేట
మచిలీపట్నం-521 001
ఫోన్ : 2818

| | | |
|---|---|---|
| విడి ప్రతి | : రు. | 4-00 |
| సంవత్సర చందా | : రు. | 48-00 |
| 4 సం॥ల చందా | : రు. | 175-00 |
| జీవిత సభ్యత్వం | : రు. | 600-00 |
| పోషకులు | : రు. | 1,116/- |

Cheques Drafts should be drawn in favour of SREE VANI, Monthly Machilipatnam

EDITED, PRINTED & PUBLISHED BY
**Komaragiri Krishna Mohan Rao**

Printed at
SREE VANI PRINTERS
MACHILIPATNAM

## విషయసూచిక

| | | |
|---|---|---|
| 'అ'కార పంచకమే అనర్థాలకు ... | - కె. కృష్ణమోహనరావు | cover 2 |
| జన్మదినోత్సవ సందేశం | - శ్రీ సత్యసాయిబాబా | పుట 2 |
| అమృతవాణి | - కూచిభట్ల చంద్రశేఖరశర్మ | 4 |
| శ్రీ సుబ్రహ్మణ్యభారతి | - కొమరగిరి కృష్ణమోహనరావు | 5 |
| అంతర్వీక్షణ | - గుడిసేవ నరసింహారావు | 8 |
| నారదభక్తిసూత్రాలు-36 | - జంధ్యాల వెంకటేశ్వరశాస్త్రి | 9 |
| పురాణవాణి-21 | - మల్లాప్రగడ శ్రీరంగారావు | 10 |
| ఋషుల చరిత్రలు-21 | - పురాణపండ "శ్రీచిత్ర" | 11 |
| కొమరగిరి కారాగార లేఖలు | | 12 |
| నిత్యజీవితంలో ఆధ్యాత్మిక దృష్టి-17 | - పాతూరి ప్రసన్నం | 14 |
| ధర్మరాజు గొప్పతనం | - కవుల ఆంజనేయశర్మ | 20 |
| వ్యక్తులూ-వ్యక్తిత్వాలు-54 | - కంచి వాసుదేవరావు | 21 |
| గీత-అమృతవర్షిణి | - సాయి గంగామహాదేవ్ | 23 |
| అభినందనలు | - కరి కృష్ణమ్మ | 27 |
| తెలిసికొనుము తెలుగుబిడ్డ | - ఏకా రామచంద్రరావు | 29 |
| శ్రీ సద్గురు సత్యసాయి | - హరి వెంకట లక్ష్మీప్రసాద్ బాబు | 31 |
| గురుస్తుతి | - డా॥ ఆచార్య తిరుమల | 32 |
| శుభం భవతు | - డా॥ రాపర్ల జనార్దనరావు | 33 |
| రసపద్మట్టాలు-6 | - జానమద్ది హనుమచ్ఛాస్త్రి | 34 |
| స్నాతకోత్సవ ప్రసంగం | - శ్రీ సత్యసాయిబాబా | 37 |

ముఖచిత్రం : "మహాకవి" శ్రీ సుబ్రహ్మణ్యభారతి

భగవాన్ బాబా జన్మదిన సందేశం



# మతమును నాశన చేసిన మః నాశనం అవుతుంది

-భగవాన్ సాయి ప్రబోధ

" పరమ పావనమైన భారతావనియందు
సహనమన్నదె మనకు చక్కదనము
వ్రతము లన్నిటియందు వన్నె గాంచినయట్టి
ఘన సత్య శీలమే కఠినతపము
మధుర భావంబేది మన దేశమందన్న
మాతృభావము కన్న మాన్యమెద్ది
ప్రాణంబు కంటెను మానంబె ఘనమను
మన దేశ నీతిని మంటగలిపి
నేటికిచ్చిరి పరదేశ నీతులరసి
వెస విచిత్ర స్వేచ్ఛయను విచ్చుక[illegible]
ఔర ! ఏమందు భారత పాలనంబు
ఏనుగెట్టుల తన బలమెఱుగలేదో
అట్టులైనారు మన భారతీయులు నేడు"

"సదయం హృదయం యస్యభాషితం సత్య భూషితం
దేహం పరహితేయస్య కలౌనాస్తిపరంసుఖమ్"

ఏ హృదయము దయామయమైనదిగా ఉండునో, ఏ హస్తములు పరోపకార దీక్షలో పాల్గొనునో, ఏ శరీరము పరుల సేవయందు నిమగ్నమగునో - అట్టి మానవ జీవితమే పవిత్రమైనది, సార్థకమైనది, సత్య జీవితము, నిత్యజీవితము. ప్రపంచమంతయూ సత్యము మీదనే ఆధారపడి ఉన్నది. సిరిసంపదలుగాని, భోగ భాగ్యములుగాని సత్యమునే ఆశ్రయించి ఉన్నవి. ఇక్కడ, అక్కడ, ఎక్కడ చూచిననూ సత్యమే ప్రకాశించుచున్నది సత్యమెక్కడో, సాక్షాత్ లక్ష్మి కూడనూ అక్కడే ఉంటుంది. సూర్యుడులేక కిరణములు ఏ విధంగా ఉండవో, సత్యములేని జగత్తు కూడా ఆ విధంగా వుండదు. సత్యమే జగత్తు, జగత్తే సత్యము. " ఈశావాస్య మిదం జగత్ " జగత్తంతయూ ఈశ్వరమయమే. ప్రాకృతమైన, భౌతికమైన, లౌకికమైన ఈ జగత్తంతయూ అసత్యమనియూ, దీనికి సత్యము ఒకటి ఆధారముగా వున్నదనియూ భ్రమించుట వెర్రితనము. విశ్వమే విష్ణువు, విష్ణువే విశ్వము. విశ్వమే విశ్వరూపం. ఈ పంచభూతములతో కూడినటువంటి ఈ ప్ర ప ం చ మే, దివ్యమైనటువంటి తేజస్సుగా భావించి, ఆనాటి మహర్షులు అనేక విధములైన సాధనలు సలిపి, సత్యాన్వేషణలో విజయమును సాధించారు ఇట్టి నిత్యమైన, సత్యమైన ఈ పరతత్వము మానవులు విస్మరించటం చేతనే, జగత్తులో శాంతి భద్రతలు కోల్పోయి, అనేక అవస్థలకు గురి అవుతున్నది ఈ ప్రపంచం.

మొదటి అంశము భూమి. ఈ భూమి సర్వత్రా వ్యాపించి ఉన్నది. సమస్త జగత్తునకు భూమియే ఆధారము. నదులు, కొండలు, సముద్రము, పట్టణములు, అన్నియూ ఈ భూమినే ఆశ్రయించి ఉన్నాయి. వైజ్ఞానికులు ఈ భూమి తిరుగుతున్నదని విశ్వసిస్తూ వచ్చారు. భూమి తిరిగినప్పుడు దీనికి ఆధేయమైనట్టి ఈ సమస్తమూ తిరుగుతుండాలిగదా ! కాని అటుల తిరగటంలేదు. భూమికి దివ్యమైనటువంటి ఆకర్షణ శక్తి ఉన్నది. ఈ ఆకర్షణ శక్తియే అన్నిటినీ

సంరక్షిస్తూ వస్తున్నది. కనుక ఈ భూమి మాత్రమే ఆధారమని చెప్పటానికి వీలుకాదు. విచారించిన భూమి కూడా ఆధేయమే. భూమికి కూడా ఆధారమైనటువంటి పరతత్త్వమే దైవత్వము. కనుక దైవత్వము నిశ్చలమై, నిర్మలమై స్థిరమైనదిగా ఉంటున్నది. ఈ భగవత్ తత్త్వమే చలించిన ఈ ప్రకృతి ఏ విధమైనటువంటి దుస్థితికి లోనవుతుందో ! రైలు కదులుతుంటే పట్టాలు కూడా కదులుతే ప్రమాదం వాటిల్లుతుంది. కారు కదులుతుంటే, రోడ్డు కూడా కదులుతే కారుకు ప్రమాదం సంభవిస్తుంది. కాదు ... కాదు ... కదిలేది కారే కాని భూమి కాదు. ఈ విధముగానే ప్రపంచమంతయూ సంచరించుచున్నది. చలించుచున్నది. దీనికి నిత్య సత్యమైనటువంటి దివ్యత్వం స్థిరముగానే ఉంటున్నది.

రెండవది జలము. ఇది భూమి ఉపరిభాగమున, లోపల ఉంటున్నది. జలమే లేకున్న జీవితము నిలువజాలదు. దీనికి 'అనిలం' అని పేరు. అనగా ఒక ప్రదేశమున ఉండి మరొక ప్రదేశమున లేకపోవటమనేది సంభవించదు. సర్వత్రా సంచరిస్తుంది ఈ జలము.

మూడవది అగ్ని. ఈ అగ్ని ప్రతి జీవియందు జఠరాగ్నిగా ప్రజ్వరిల్లుతున్నది. మేఘములు, మేఘములు రాచుకున్నప్పుడు అగ్ని పుడుతుంది. రాయి, రాయి రాచుకున్నప్పుడు అగ్ని పుడుతుంది. కర్రకు కర్రకు రాపిడి జరిగినప్పుడు కూడా అగ్ని పుడుతుంది. కనుక అగ్నికూడా సర్వత్రా వ్యాపించినటువంటిదే.

నాల్గవది ఆకాశము. ఈ ఆకాశము అన్నింటికీ ఆశ్రయమైవుంటున్నది. ఐదవది గాలి. గాలిలేని జీవితం ఉండజాలదు. సర్వత్రా గాలి ఇమిడివుంటున్నది. ఈ పంచభూతములకే ఇంతటి శక్తి ఉన్నప్పుడు, వీటికి ఆధారమైనటువంటి భగవంతునికి ఎంతటి శక్తి ఉన్నదో విచారించవచ్చు. పంచభూతములే పరమాత్మ స్వరూపములు. దీనిని ఏ శాస్త్రజ్ఞుడు కాదనటానికి వీలుకాదు. కాని ఈనాడు ఈ పంచభూతములను మనం సరియైన మార్గంలో ప్రవేశపెట్టక, సక్రమమైన మార్గంలో అనుభవించక, దీనిని దుర్వినియోగ పరుస్తున్నాం. ఈ దుర్వినియోగ ఫలితమే ఈనాటి సమస్యలకు మూలకారణం. ఈ సత్యమును కాపాడటానికి ఆనాటి మహర్షులు మితభాషులైనారు. మితభాష సత్యమును పోషిస్తూవచ్చింది ఈనాడు అమితభాష కావటంచేతనే కొన్ని అల్లకల్లోలములకు కారణమవుతూ వచ్చింది. కనుక పంచభూతముల స్వరూపమే ఈ ప్రపంచమనేటటువంటి సత్యమును మనం గుర్తించి వర్తించడం అత్యవసరం.

ఈ పంచభూతముల స్వరూపమును నిరూపించినటువంటిదే మనస్సు. ఈ మనస్సునుండి ఆవిర్భవించినటువంటిదే 'మతి' ఈ మతియొక్క ప్రతిబింబమే 'మతము' ఈ మతము అనేటటువంటిది కేవలం ప్రత్యేకంగా భౌతికంగా చెప్పుకొనేటటువంటి మతము కాదు. ఈనాడు ఇట్టి మతమును నాశనం చేయాలని అనేకమంది ప్రయత్నం చేస్తున్నారు. మతమును నాశనం చేసిన మతియే నాశనం అవుతుంది. మతియే నాశనం అయిన మనుష్యుడే నాశనం అవుతాడు. మత ద్వేషములను నిర్మూలనం గావించాలి గాని మతమును కాదు. అన్ని మతములవారు ఈ పంచభూతముల శక్తులను, పవిత్రమైన దివ్యత్వాన్ని విశ్వసిస్తూ, పూజిస్తూ, ఆరాధిస్తూవస్తున్నారు. కాని భారతీయులు చెప్పు మాటలకు, చేయు చేతలకు, తలచు తలంపులకు ఏకత్వాన్ని నిరూపిస్తున్నారు. దైవము సర్వభూతముల యందూ వున్నదని, సర్వత్రా వ్యాపించినటువంటి వాడని, సర్వశక్తిమయుడని మన వేదములు ఘోషిస్తూ వచ్చాయి. దీనిని అన్ని మతములవారు అంగీకరిస్తునే వున్నారు. దానిని అంగీకరిస్తూ, ప్రబోధిస్తున్నారే

( తరువాయి 25 వ పేజీలో )

బుద్ధ్వాన బోధ్యం పరిశిష్యతే కిం ?
శివప్రసాదం సుఖబోధరూపం
జ్ఞాతేతుకస్మిన్ విదితం జగత్స్యాత్ ?
సర్వాత్మకే బ్రహ్మణి పూర్ణరూపే ॥

# అమృతవాణి

మాచిభట్ల చంద్రశేఖరశర్మ

లోకంలో అనేక విద్యలున్నాయి. అన్ని విద్యలూ తెలిసినవారెవరూ వుండరు. ఒక్కొక్కరు ఒక్కొక్క విద్యలో నిష్ణాతులవుతారు. గొప్ప పండితులనుకుంటే రెండు మూడు శాస్త్రాల్లోనో ఒకటి రెండు వేదాల్లోనో పండితులు కావచ్చు. నాల్గు వేదాలు, ఆరు శాస్త్రాలు, దర్శనాలు, పురాణాలు, ఇతిహాసాలు మొదలయినవన్నీ సంపూర్ణంగా తెలిసినవారెవరైనా వుంటారా అంటే అసలే వుండరు.

కనుక ఏ విద్యా సంపూర్ణమైంది కాదన్నమాట ఏదీ సంపూర్ణం కానప్పుడు, సంపూర్ణ జ్ఞానం మాత్రం యెలా కలుగుతుంది ? కలగదన్నమాటేగా ? ఇది యిలా వుండగా లౌకిక విజ్ఞానమెంతో వుంది అదంతా తెల్సుకోటానికి భౌతికశాస్త్రాలనేకం వున్నాయి. విజ్ఞానానికి అంతనేది లేదు. ఎంత చదివినా యెంత చదువుకున్నా ఇంకా తెల్సుకోవల్సిందెంతో మిగిలిపోతూనేవుంటుంది

అసలు సంపూర్ణజ్ఞానం కలిగించేది యేదైనా వుందా ? అనే ప్రశ్నవేస్తే, వుంది అనే సమాధానం వుంది అదే పరమాత్మ. పరమాత్మతత్త్వం తెల్సుకుంటే చాలు సంపూర్ణజ్ఞానం కలుగుతుంది కారణమేమిటంటే— పరమాత్మ యొక్క తత్త్వం మిక్కిలి శుద్ధమైంది ఆనందరూపంగా వుంటుంది అణువణువునా సమస్త బ్రహ్మాండభాండాలు నిండివుంటుంది ఆద్యంతపు లేక నిత్యమై సత్యమై సర్వత్రా వ్యాపించివుంటుంది ఆ తత్త్వం కల్యాణరూపం ఆ తత్త్వాన్ని ఉపనిషత్తులు మొదలయినవి వివరించి చెప్పాయి. కాని ఆ ఉపనిషద్విజ్ఞానంతో ఆ పరతత్త్వాన్ని గుర్తించి సాధనతో చక్కని అనుభవంలోకి తెచ్చుకోవాలి.

అలా అనుభవంలోకి ఆత్మజ్ఞానం సిద్ధించినట్లయితే ప్రపంచంలో సమస్త విద్యా సంబంధ జ్ఞానం దానంతట అదే సిద్ధిస్తుంది అందుకనే మహాయోగనిష్ఠులయిన తాపసులు తమలోనే పరమాత్మను తెల్సుకొని సర్వ విజ్ఞానాన్ని కరతలామలకం చేసుకుంటున్నారు. ఆ శివప్రసాదమే సుజ్ఞానమంటే ఆత్మజ్ఞానం సంపాదించిన తర్వాత యింకా తెల్సుకోవల్సిందేదీ మిగలదు.

సర్వాత్మకమైన పరబ్రహ్మ తత్త్వాన్ని తెల్సుకున్న తర్వాత దృశ్యాదృశ్య జగత్తు అంతయు స్పష్టంగా గోచరమౌతుంది. సృష్టి స్థితిలయల స్వరూప స్వభావాలు తెలుస్తాయి. సమస్త ఆధ్యాత్మిక జ్ఞానమేకాక భౌతికజ్ఞాన సర్వస్వం సువిదితమవుతుంది

కనుక బ్రహ్మజ్ఞానం సంపాదించుకోవటమే జీవిలక్ష్యం కావాలన్నమాట ప్రతి వ్యక్తికీ ○

## చందాదారులకు మనవి

చందాలను సకాలంలో రెన్యూల్ చేసి, క్రొత్త చందాదారులను చేర్పించి, ఉత్తమ విలువలు గల
శ్రీవాణి మాస పత్రికను రాబోయే తరాలకు అందించే అవకాశం కల్పించండి.
ఉత్తమ సాహిత్యానికి మీవంతు తోడ్పాటు నందించండి.

— సం॥

సాహిత్యరంగంలో ధృవతార

# శ్రీ సుబ్రహ్మణ్య భారతి

- కొమరగిరి కృష్ణమోహనరావు

"శ్రీ॥ శే॥ సుబ్రహ్మణ్యభారతి నాలుక చివర సరస్వతీదేవి నృత్యం చేసిందని చెబితే అతిశయోక్తి కాదు. ఈయన ఈ భారతదేశంలో కాకుండా ఏ ఇతర దేశంలో జన్మించి ఉండినా, ఆయనను ఆస్థానకవిగా దేశం ఆదరించి ఉండేది. కాని మనది ఒక పరాధీన దేశం కావడం వలన ఆయన దేశ బహిష్కృతుడుగా, పాండిచ్చేరిలో ఫ్రెంచి ప్రభుత్వపు ఆతిథ్యంలో రోజులు గడుపవలసి వచ్చింది. సుబ్రహ్మణ్యభారతి దేశభక్తుడుగానే బ్రతికి నిష్క్రమించాడు. అధ్యక్ష మహాశయా! నేను మళ్లీ చెబుతున్నాను. తమిళ భాష ఉండేంతకాలం, మీరు ఆయన పుస్తకాల ప్రతులన్నింటినీ వశపరచుకొని మాయం చేసినప్పటికీ, ఆయన రచనలు తమిళ జాతి యొక్క అమూల్యమైన వారసత్వ సంపదగా నిలిచే ఉంటాయని నేను ఘంటాపథంగా చెప్పగలను" అని మద్రాసు శాసనమండలిలో 1928 సం. లో శ్రీ ఎస్. సత్యమూర్తి ఉద్వేగ పూరితమైన ప్రసంగం చేశారు.

సుబ్రహ్మణ్య భారతి 40 ఏండ్లు నిండకుండానే మరణించే నాటికి ఆయన రచనలు వెలుగు చూడనే లేదు ఆర్థికమైన ఇబ్బందులలో ఉన్న ఆయన కుటుంబం, కొంత ధనం వస్తుందనే ఆశతో ప్రచురణను ప్రారంభించారు "భారతీ ప్రచురణాలయం" ను నెలకొలిపి ముద్రణను ప్రారంభించాడు ఆయన తమ్ముడు విశ్వనాథ అయ్యర్. అనేక రకములైన యిబ్బందుల నెదుర్కొనినాడు చిట్టచివరికి ఆంగ్ల ప్రభుత్వం నుండి కూడా అవరోధం ఏర్పడింది. విద్రోహ రచనలనే నెపంతో రెండు వేల ప్రతులను మద్రాసు ప్రభుత్వం వశపరచుకొన్నది స్వాతంత్ర్యం వచ్చిన తరువాత "భారతి" వ్రాసిన గీతాలకు గిరాకీ పెరుగుతూవచ్చింది. భారతి నాలుగు రకాల గేయాలు వ్రాశాడు. 1 దేశభక్తి గీతాలు 2 భక్తి గీతాలు 3. గీత కదంబం. 4 మూడు కావ్యాలు (కృష్ణ గీతాలు, పాంచాలి శపథం, కోయిల పాటలు) భారతి ప్రధానంగా గీత రచయిత. మొదటి మూడు విభాగములలోవి కవితలన్నీ ఇంచుమించు పాటలే

సుబ్రహ్మణ్యభారతి 1882 డిశంబర్ 11 వ తేదీన తిరునల్వేలి జిల్లా ఎట్టాయ పురంలో జన్మించాడు. తండ్రి పేరు చిన్నస్వామి అయ్యర్. ఈతను ప్రథమ సంతానం. పసిబిడ్డగా వున్నప్పుడే తల్లిని కోల్పోయాడు. తండ్రి జమీందారీ కొలువులో ఒక చిన్న ఉద్యోగి తండ్రి ఆశలన్నీ ఆ అబ్బాయిపైననే పెట్టుకున్నాడు ఇంగ్లీషు చదువులు చదివించి పెద్ద ఆఫీసరుగానో, ఇంజనీరుగానో చేయాలని తండ్రికోరిక. కాని భారతికి చదువుమీద పెద్ద ఆసక్తి వుండేదికాదు. భారతి మాతామహుని దగ్గరనే ఎక్కువ కాలం గడిపేవాడు. పదో సంవత్సరం రాక పూర్వమే భారతి తమిళంలో కవిత్వం చెప్పడం ప్రారంభించాడు. ఎనిమిదేళ్ళ ప్రాయంలోనే, ఇతరులేదైనా సూచించగానే, దానిమీద చక్కని పద్యాలు కట్టేవాడు ప్రసిద్ధులైన పద్య రచయితలు కూడా వాటిని చదివి ఆశ్చర్యపడేవారు. కాని అది తండ్రికి రుచించక తిరునల్వేలి హైస్కూ-

లులో చేర్చాడు. అక్కడ తోటి విద్యార్థులకు చమత్కారమైన మాటలు చెబుతూ, ఆశుకవిత్వం వినిపిస్తూ అందర్నీ ఆకట్టుకొనేవాడు. అయితే మెట్రిక్యులేషన్ పూర్తి కాకుండానే చదువు నిలిచిపోయింది. అతనికి 15 వ ఏటనే వివాహం జరిగింది. భార్య పేరు చెల్లమ్మాళ్. తరువాత కొన్ని సంవత్సరాలు ఎట్టాయపురంలో ప్రసిద్ధ వ్యక్తిగా పేరుగాంచాడు. అతని పాండిత్య ప్రతిభకు " భారతి " అని బిరుదు కూడా అప్పుడే యివ్వబడింది ఒకనాడు, రాజసభలో, తన కవితాశక్తిని నిరూపించుకున్న సందర్భంలో ఆ బిరుదు ప్రధానం చేయబడింది అంతవరకు "ఎట్టాయపురం సుబ్బయ్య " అని పిలువబడుతున్న ఆ అబ్బాయి నాటి నుండి "భారతి" అనే పేరుతో ప్రసిద్ధుడయినాడు.

తండ్రి మరణించాడు కుటుంబం ఇబ్బందుల పాలైంది భారతి కాశీకి వెళ్ళాడు అక్కడ సంస్కృతం, హిందీ, ఇంగ్లీషు భాషలలో ప్రావీణ్యం సంపాదించి, అలహాబాద్ విశ్వవిద్యాలయ ప్రవేశ పరీక్షకు కూర్చొని ఉత్తమశ్రేణిలో కృతార్థుడయినాడు. కాశీలో గడిపిన సమయంలో అతని వ్యక్తిత్వంలో మహత్తరమైన మార్పు వచ్చింది. బాహ్య వేషంలో శిక్కుల శిరస్త్రాణం, మీసకట్టూ నడకలో ధీమా ఏర్పడింది ఆనిబిసెంట్ ఉపన్యాసాలు వినడం వలన విశాల దృక్పథం కూడా అలవడింది. విప్లవ భావాలు పెల్లుబికినాయి. షెల్లీ రచనలు అధ్యయనం చేయటం వలన అతనిలో ఆధునిక కవితాశక్తి రూపుదిద్దుకొన్నది. దారిద్ర్యం మాత్రం అతనిని వదలలేదు 1901 వ సం॥ లో ఎట్టాయపురం తిరిగివచ్చి జమీందారి కొలువులో ప్రవేశించాడు తీరిక సమయాలలో షెల్లీ. కంబన్, ఇళంగో కవుల రచనలను లోతుగా అధ్యయనం చేసేవాడు తరువాత మధురై పట్టణం చేరి మూడు నెలలపాటు " సేతుపతి " హైస్కూలులో తమిళ పండితుడుగా ఉద్యోగం చేశాడు. 1904 సం॥ లో "స్వదేశ మిత్రన్" దిన పత్రికలో చేరి స్వామి వివేకానంద, అరవిందఘోష్, తిలక్ వంటి మహా నాయకుల ఉపన్యాసాలు తమిళంలోనికి చక్కగా అనువదించేవాడు. ఆ తర్జుమా అనుభవం ఎంతగానో అతనికి ఉపకరించి, స్వంత రచనలకు బాగా ఉపయోగపడింది ఉపసంపాదకుడుగా వుంటూ రాజకీయనాయకులతో సన్నిహిత సంబంధం ఏర్పరచుకున్నాడు. అందులో కాంగ్రెసులోని అతివాదులను సమర్థించేవాడు. 1905 సం॥ డిశంబర్‌లో కాశీలో జరిగిన అఖిల భారత కాంగ్రెసు సమావేశానికి హాజరై తిరిగి వస్తూ కలకత్తా వెళ్ళి సోదరి నివేదితను కలిసాడు ఆ కలయిక "భారతి"లో ఒక మహత్తర పరిణామానికి కారణమైంది సోదరి నివేదితను తన ఆధ్యాత్మిక గురువుగా భావించాడు. దేశభక్తి పూరితమైన తన మొదటి కవితా సంపుటలు అయిన 'స్వదేశగీతంగళ్', 'జన్మభూమి' లను ఆమెకు అంకితం చేశాడు.

ఆవేశంతో తాను వ్రాసిన రచనలు, తాను పని చేస్తున్న " స్వదేశమిత్రన్ " వంటి మితవాద పత్రికలో ప్రచురించే అవకాశం లేకుండా పోవటం వలన తిరుమలాచారి, శ్రీనివాసాచారి సోదర ద్వయం స్థాపించిన "ఇండియా" అనే తమిళ వార పత్రికలో చేరి తన రచనలకు ఒక రూపం యిచ్చాడు భారతి. అయితే అనతికాలంలోనే "ఇండియా" పత్రిక మీద ఆంగ్ల ప్రభుత్వము యొక్క కన్నుపడి, ఆ పత్రికను పాండిచ్చేరికి మార్చవలసివచ్చింది. " భారతి " మీద కూడా అరెస్టు వారంటు జారీ కావడంవలన అతను పాండిచ్చేరికి మకాం మార్చవలసివచ్చింది. "భారతి" తన రచనా వ్యాసంగాన్ని బాగా అభివృద్ధి చేసుకొని "ఇండియా" పత్రిక ద్వారా మంచి పేరు తెచ్చుకున్నాడు. "ఇండియా" పత్రిక యొక్క ప్రజాదరణను చూచి ఆంగ్లేయులు ఓర్వలేక, ఆ పత్రిక భారత దేశంలో ప్రవేశించడానికి వీలు లేకుండా ఆంక్షలు విధించింది ఆంగ్ల ప్రభుత్వం. గత్యంతరం లేక

1910 సం. మార్చి 12 వ తేదీన పత్రిక ముద్రణ నిలిపివేయబడింది "భారతి" నిరుద్యోగి అయినాడు.

" అరవిందఘోష్ " రాజకీయాలను విరమించి 1910 సం ఏప్రియల్‌లో పాండిచ్చేరి చేరారు. ఆశ్రమాన్ని ఏర్పాటు చేశాడు. సుబ్రహ్మణ్యశివ, వి.వి. యస్. అయ్యర్ వంటి రాజకీయ నాయకులు కూడా అక్కడికి చేరారు వారందరితో "భారతి"కి స్నేహం ఏర్పడింది. వారి సాహచర్యం వలన "భారతి" లో మానసికమైన మార్పు వచ్చింది. ఆధ్యాత్మిక ప్రేరణ కలిగింది. "భగవద్గీత" ను అధ్యయనం చేశాడు. భారతి కవితా వ్యాసంగంలో కూడా ఊహించని మార్పు వచ్చింది. ఆధ్యాత్మికత వైపుకు ఆయన కలం పరుగెత్తింది. దీక్షతో తన వ్యాసంగాన్ని కొనసాగించాడు ఆకలి బాధతో భారతి పాండిచ్చేరి సముద్రతీరాన సుదీర్ఘ సమయాలు గడిపేవాడు. ఆత్మహత్యకు పాల్పడకుండా నిగ్రహంతో, ఆత్మశక్తిని ప్రదర్శించి, ఆ సమయం లోనే "కణ్ణన్ పాట్టు" (కృష్ణగీతాలు) "పాంచాలి శపథం" "కుయిల్ పాట్టు" ( కోయిల పాటలు ) వంటి మహా కావ్యాలను సృష్టించాడు

దేశ బహిష్కృతిని సహించలేక బ్రిటీష్ వారి అధికారంలో నున్న భారతదేశానికి తిరిగి రావడానికి నిశ్చయించుకున్నాడు. ఫ్రెంచ్ బ్రిటీష్ సరిహద్దులలో 1918 సం॥ నవంబర్ 20 వ తేదీన ఆంగ్ల పోలీసులు అతనిని అరెస్టుచేసి కడలూరు సబ్ జైలుకు పంపినారు. సి పి. రామస్వామి అయ్యర్‌గారి జోక్యంతో విడుదల అయినాడు. తరువాత రెండు సంవత్సరాలు అత్తగారి ఇంట్లో కాలం (కడయంలో) గడిపాడు. చుట్టుప్రక్కల గ్రామాలకు వెళ్ళి చక్కటి ఉపన్యాసాలు చేసేవాడు. "స్వదేశ మిత్రన్ " పత్రికలవారు ఆహ్వానించగా దానిలో చేరాడు. ఆ పత్రికలో అనేక వ్యాసాలు వ్రాసి ప్రజల ఆదరాభిమానాలను పొందాడు 1921 సం॥ ఆగష్టు 4 వ తేదీని ప్రచురితమైన వ్యాసం ముగింపులో "ప్రహ్లాదునివలె అచంచల భక్తి, ప్రపత్తులను, మన్మథునివలె ధర్మపత్ని పట్ల గాఢానురక్తినీ, కలిగి వున్న మానవుడు, ఇహంలోనే ముక్తిని పొంది, దైవత్వాన్ని సాధించి, స్థిరమైన ఆనందంలో జీవిస్తాడని నా దృఢ విశ్వాసం" అని వ్రాస్తాడు.

" భారతి, తిరువళ్ళిక్కేణి " దేవాలయానికి వెళ్ళుతాడు అక్కడ ఏనుగుకు కొబ్బరికాయ అందిస్తాడు. దురదృష్టవశాత్తు ఏనుగు తన తొండంతో "భారతి" ని కొడుతుంది. స్పృహతప్పి పడిపోతాడు. పరిస్థితి విషమిస్తుంది. 1921 సం॥ సెప్టెంబర్ 12 వ తేదీన శాశ్వతంగా, ప్రశాంతంగా కన్నుమూస్తాడు "భారతి" అయితే ఆయన రచనల వ్రాతప్రతులు ప్రచురణకు నోచుకోకుండా కట్టలు కట్టలుగా పడిఉండడమే ఆయన హృదయాన్ని వేధించింది. ఎంతోమంది స్నేహితులు అర్థించినా, ప్రచురణ కర్తలను ప్రాధేయపడినా ప్రయోజనం లేకపోయింది. భారతి మరణించి తన కవితా సంపదను మనకు యిచ్చి మరల తిరిగి రాని సుదూర ప్రాంతాలకు వెళ్ళిపోయాడు అయితే ఆయన అందించిన సాహిత్యంలో తమిళ సాహిత్య స్వరూపమే మారిపోయింది వేలాదిమంది యువ రచయితలు భారతి రచనల నుండి స్ఫూర్తిని పొందారు. భారతి నేడు భౌతికంగా మనకు కనిపించకపోవచ్చును. కాని ఆయన ఆధునిక తమిళ సాహిత్య సృష్టికర్తగా నీరాజనాలందుకుంటున్నాడు నేడు. ఆయన రచనలు నేడు అనేక భారతీయ భాషలలో తర్జుమా చేయబడి సాహిత్య రంగంలో ధృవతారగా వెలుగొందుతున్నాడు ఈనాడు ' సుబ్రహ్మణ్య భారతి '

'భారతి' భారత దేశ సమగ్ర స్వరూపాన్ని దర్శించాడు ఈ పునీత దేశమును 'భారతమాత'గా భావించి వరించాడు.

## అంతర్వీక్షణ

అద్దమునందున బింబము
ముద్దులు గొనుచేలనోయి,
మూర్ఖుడవగుచున్
రద్దులు బెంచుట మానుము
ఒద్దికతో నీదువైన మోర్మిని గనరా !

కందర్పుని శరములబడి
కొందలమందుచు మనమున కోరిక లూరన్
మందుడవై చెడిపోకుము
సుందరమా నీదు రూపు చూడగదోయీ !

బుద్బుదంబు దీని బుటపాట మెన్నాళ్ళు
శబ్ద స్పర్శ రూప సంకులంబు
పాంచభౌతికంబు పట్టి యుంచగరాదు
చంచలంబు దీని నెంచగలమె.

ఆహా ! ఏమీ గారడీ !
ఓహో ! పరమాద్భుతంబు ఒప్పగగనుమీ!
"సోహం" "సోహం" "సోహం"
ఆహావతంగమున నిల్చి అరయుము నిజమున్

ఆగదు కాలము దేహము
ఆగదు సర్వంబుచూడ ఆశ్చర్యంబా
ఆగని దానికి దేనికి
సాగింతువు ఘోరకర్మ సంఘాతంబుల్ !

— గుడిసేవ నరసింహారావు

" ఉత్తుంగ హిమవన్నగము మాదీ
భూమిపై దానికి సాటి ఏదీ ?
పావనోధార గంగ మాదీ
అందాన దాని సాటి నది ఏదీ ?
పవిత్రమైన ఉపనిషత్తులు మావీ
వాటిబోలు మత గ్రంథాలు పేర్కొనగనేవీ ?
స్వర్ణారుణ కిరణ రంజిత భూమి మాదీ
ఆమెకామెయే సాటి,
కొనియాడుదాము రండీ ! "

దేశ సంక్షేమంకోసం సమైక్య కృషి అవసరమని చెప్పాడు పైకి కనిపించే వైవిధ్యాలకు ప్రాధాన్యత నివ్వకూడదని బోధించాడు. భిన్నత్వంలో ఏకత్వాన్ని తన రచనలో చూపించాడు.

" ముప్పైకోట్ల ముఖాలున్నాయి ఆమెకు
కాని హృదయం ఒక్కటే.
పద్దెనిమిది భాషల్ని మాట్లాడుతుందామె
కాని ఆమె మనస్సు ఒక్కటే "

భారతి రచనలలో దైవభక్తి, దేశభక్తి ప్రతిబింబిస్తుంటుంది. అంతేకాదు ఆధ్యాత్మిక భావాలు కూడా ప్రస్ఫుటంగా కనిపిస్తాయి. ఉత్తేజం, ఉత్సాహం జ్యోతకమవుతాయి. స్ఫూర్తిని, శక్తిని పెంపొందించి, కార్యోన్ముఖులను గావిస్తాయి ఆయన రచనలు.

" ద్వేషాన్ని జయించి
భయాన్ని భంజించి
పలుకుమురా భారతనామం పలుకుమురా !
మ్రోగించు ఢంకా !
మ్రోగించు విజయఢంకా !
భయమనే రాక్షసుని గెలిచి
అసత్యమనే సర్పాన్ని చంపి
మనం వేదమార్గాన్ని ఎంచుకున్నాం
అదే బ్రహ్మజ్ఞానానికి బాట ! "

'భారతి' ఉత్తమకవి మాత్రమే కాదు. ఆయన కేవలం ఒక్క తమిళ ప్రాంతానికో ! భారత దేశానికో! మాత్రమే చెందిన కవి కాదు. యావత్ మానవజాతికే ఆయన ఆరాధ్యుడు ఆయనను స్మరిస్తూ, ఆయన రచనలను మననంచేస్తే, మనలోకూడా మానవతా విలువలు పెంపొందుతాయి. ○

శ్రీవాణి

## నారదభక్తి సూత్రాలు - 36

# భక్తి దర్శనాచార్యులు

-'శాంతిశ్రీ' జంధ్యాల వేంకటేశ్వరశా

84 సూ. య ఇదం నారద ప్రోక్తం
శివానుశాసనం
విశ్వసితి శ్రద్ధతే స భక్తిమాన్
భవతి
స శ్రేష్టం లభతే స ప్రేష్ఠం
లభత ఇతి

నారద ప్రోక్తములైన ఈ మంగళకరసూత్రాలు శివుడు అనుశాసించినవే మానవుడు వీనిపై ప్రగాఢమైన విశ్వాసం ఉంచి శ్రద్ధగా అభ్యసించినచో ప్రాణ ప్రియమైన భగవంతుని పొందగలడు.

ఏ శాస్త్రానికైనా నాలుగు ముఖ్యాంగాలుంటాయి. అర్హత - విషయం - సంబంధం - ప్రయోజనం.

ఈ భక్తి శాస్త్రాభ్యాసానికి మానవజన్మ పొందటమే అర్హత. ఇది ఎన్ని జన్మల సుకృతఫలం వల్లనో కానీ లభించదు. పశుపక్ష్యాదులు కూడా సత్కర్మలు చేయాలి. అనుకోకుండానే మంచి పనులకు అవి ఉపయోగపడి పుణ్యం సంపాదిస్తాయి. మానవ జన్మను పొందుతాయి. మానవులై పుట్టి శాస్త్రజ్ఞానం కలిగి సంకల్పించి భగవత్కృపకు పాత్రులవుతాయి.

విషయంఅనగా శివానుశాసనం పాలించడమే. ఆత్మ కళ్యాణంతో లోక కళ్యాణ కార్యక్రమమే ఈ శాస్త్రానికి గల ముఖ్య విషయం.

శాంతి సత్యాహింసాది సుగుణాలు అన్నీ ఒక గొలుసు లోని కడియాలవంటివి. ఇవి అన్నీ పరస్పర సంబంధితాలు. వీనిని మెదడుతో తెలుసుకొని హృదయంతో భావనచేసి సంబంధం కలపాలి జీవాత్మ పరమాత్మల సంబంధమే ఈ సంబంధం.

ఈ శాస్త్ర ప్రయోజనం జీవాత్మ పరమాత్మతో ఐక్యమై బ్రహ్మానందానుభవం పొందటమే

ఇది ఫలశ్రుతి ఈ నారద సూత్ర సూక్తులు శివానుశాసనంగా పార్వతీ దేవ్యాది సురవర్యులు ఆచరించి ఇష్టకామ్యాలు పొంది శాశ్వతులైనారు విశ్వాసం, శ్రద్ధ అభ్యాసం, భక్తునికి సాధనోపాయాలు ఈ పరమ భక్తిని పొందటమే చరమ పురుషార్థం. ధర్మార్థ కామ మోక్షాలు నాలుగూ కాక ఈ పరమ భక్తి పంచమ పురుషార్థం. ఇది మోక్షం కంటె అధికమైనది. ఇది అందుకోవటమే మానవ జీవన పరమ ప్రయోజనం.

శివుడు పార్వతీ దేవికి కాశీమహాత్మ్యం చెప్పి భక్తి లేని వానికిది వినిపించకు అంటాడు-

ఈ రహస్యంబు చెప్పకు మెవ్వరికిని
శంభు భక్తున కత్యంత శాంతమతికి
శ్రద్ధధానున కధిక విశ్వాసమతికి
అనఘ మానసునకు ముముక్షునకు దక్క-

ఇతి శివమ్

( ఈ సంచికతో "నారద భక్తి సూత్రాలు" సమాప్తమైనాయి. ఈ వ్యాసములను అందించిన 'శాంతిశ్రీ' శ్రీ జంధ్యాల వేంకటేశ్వర శాస్త్రి గారికి కృతజ్ఞతాభివందనలు )

# పరీక్షిత్తు

-మల్లాప్రగడ శ్రీరంగారావు

కౌరవ పాండవ సంగ్రామ సమయంలో పద్మవ్యూహంలో ప్రవేశించి అనేక వీరులను సంహరించి ఏకాకియై చివరకు నిరాయుధుడైన అభిమన్యుని కురు వీరులు సంహరించారు అప్పటికే అభిమన్యుని భార్యయైన ఉత్తర గర్భంలో ఉన్న శిశువును అశ్వత్థామ సంహరిస్తానని దుర్యోధనునితో పలికి గర్భస్థ శిశువుపై బ్రహ్మాస్త్రాన్ని ప్రయోగించాడు ఆ సమయంలో ఉత్తర భగవంతుని ప్రార్థింపగా అతడు చక్రమును గర్భం లోపలికి ప్రవేశింప చేసి బ్రహ్మాస్త్రము నుండి ప్రమాదము రాకుండ ఆ శిశువును రక్షించాడు అతడు తల్లి కడుపులో నుండి నేలపై పడుతూనే తనను తన తల్లి గర్భంలో వుండగా రక్షించిన భగవంతుడంతటా వున్నాడన్న నమ్మకంతో అందరిని పరీక్షించినందున అతనికి పరీక్షిత్ అని పేరు పెట్టారు

ఈ పరీక్షిత్ పెరిగి పెద్దవాడై 60 సంవత్సరములు రాజ్యమును పాలించాడు ఒకనాడు వేటకై అడవికిపోయి కొంతసేపు వేటాడి అలసిపోయి దాహ శాంతికై ఒక ముని ఆశ్రమానికి వచ్చాడు శమీకుడనే ముని తపస్సు చేసుకొనుచుండగా అతనిని తనకు దాహ శాంతికై నీరు యిమ్మని అడిగెను తపస్సులో ఉన్న ఆ మునికి యీ రాజు మాటలు వినపడలేదు కోపించిన ఆ రాజు చచ్చిన పామును తెచ్చి ఆ ముని మెడలో వేసి తన నగరానికి తిరిగి వెళ్లెను కొంత సేపటికి అడవి నుండి సమిధలు తెచ్చిన ఆ ముని పుత్రుడు 'శృంగి' యను వాడది చూచి ఆగ్రహించి నిష్కారణంగా మా తండ్రి మెడలో చచ్చిన పామును వేసినవాడు నేటికి ఏడవనాడు పాము కాటుచే మృతి చెందునని శపించాడు తండ్రియైన శమీకుడిది తెలుసుకొని రాజునకు గల శాపమునకు విచారించి శాపము నివారింప శక్యము కాదని గుర్తించి పరీక్షిత్తునకు శిష్యుని ద్వారా శాపవార్తను తెలియచేసాడు పరీక్షిత్తు తను చేసిన పాపకార్యానికి చింతించి మహర్షులను రప్పించి తాను మరణానికి భయపడడం లేదని మరణించేలోగా తన జీవితం సార్థకమయ్యే మార్గం చెప్పండని కోరగా అదే సమయంలో శుక మహర్షి ఆహ్వానం లేకుండానే వచ్చి భగవన్నామ సంస్మరణ, భగవత్కథా శ్రవణం జీవిత పరమార్థము నందించునని భగవత్కథలు చెప్పడమారంభించాడు. పరీక్షిత్ ప్రాయోపవిష్టుడై భక్తి శ్రద్ధలతో ఆ కథలను వినుచు మనస్సు దైవమందు లగ్నము చేసెను ఇట్లుండ ముని శాపవశాన 7వ రోజున ఆ రాజు వద్దకు వచ్చిన విప్రులు ఒకపండును కానుకగా యిచ్చిరి దానిని వాసన చూచినంతలో అందుండి చిన్న పురుగుగా బయటకు వచ్చి కాలసర్పమై ఆ రాజును కాటువేసి మాయమయ్యెను పాము కాటుచే మరణించినా భగవత్కథా శ్రవణం చేస్తున్న కారణము చేత ఆ పరీక్షిత్తునకు విష్ణులోక ప్రాప్తి లభించెను ఈ భాగవత కథ అవసాన కాలమున భగవత్కథా శ్రవణము ముక్తిదాయకమని గుర్తించి మన బోటి మానవులు నిరంతరము భగవన్నామాన్ని స్మరిస్తూ భగవంతుని కథలు వింటూ వుండాలి. అదే మానవ జీవితము చరితార్థ మగుటకు చక్కని మార్గము.

# నరనారాయణ మహర్షులు

- పురాణపండ 'శ్రీచిత్ర'

నరనారాయణులిద్దరూ మహాపురుషుని భార్యకు కవలలుగా జన్మించారు. శ్రీహరి అవతారములలో వీరిది నాల్గవది. విష్ణువు రెండు రూపాలుగా అవతరించాడు. బదరికావనమందు ఆశ్రమమును నిర్మించుకొని వీరిరువురు ఉగ్ర తపస్సు చేయసాగారు. ఇంద్రుడు అసూయ చెంది తపోవిఘ్నం గావించ అప్సరసలను పంపించాడు. ప్రయోజనం లేకపోయింది. అంతేకాదు నారాయణుడు తన ఊరు భాగమునుండి ఒక అప్సరసను సృజించి వారి ఎదుట నిలిపి "కాంతలారా! ఇంద్రుడు పంపగా మీరు వచ్చారు. మాకు కామవాంఛ లేదు అందుకు నిదర్శనంగా అపూర్వ సౌందర్యవతియగు ఈ ఊర్వశిని సృష్టించాను మీరీమెను తీసుకొనివెళ్ళి ఇంద్రునకు కానుకగా యివ్వండి" అని చెప్పగా వారు ఆమెను తీసుకొనివెళ్ళి ఇంద్రునికి జరిగినదంతా చెప్పగా ఇంద్రుడు ఆశ్చర్యచకితుడైనాడు.

ప్రహ్లాదుడు తీర్థయాత్రలు చేయుచూ తపస్సు చేసుకొంటున్న నరనారాయణులను చూచాడు. వారి ప్రక్కన వున్న మఱ్ఱిచెట్టుపై బాణాలను చూచి, ఋషుల వద్ద బాణములు ఏమిటని ఆశ్చర్యపోయి ప్రహ్లాదుడు వారినుద్దేశించి "తాపసులారా! మీ తపస్సు కట్టిపెట్టండి!" అని బిగ్గరగా అరిచాడు. వారా పలుకులు విని "ఓయీ! మేము అటు బ్రాహ్మణ్యానికి, ఇటు క్షాత్రానికి నిష్ణాతులం అందుకే విల్లంబులను కూడా కలిగివున్నాం. అసలు మా గురించి నీకేల? నీ దారిన నీవు పో" అన్నారు. అప్పుడు ప్రహ్లాదుడు కోపంతో క్షత్రియుడవైతే తనతో యుద్ధం చేయమనగా, నరుడు సిద్ధమైనాడు. వారిద్దరి మధ్య అపూర్వమైన యుద్ధం జరిగింది. వేలసంవత్సరాలు జరిగింది. జయాపజయాలులేవు యుద్ధం అంతం కావటంలేదు. చివరకు నారాయణుడు విష్ణురూపం దాల్చి ప్రహ్లాదుని ఎదుట నిలువగా భక్తిశ్రద్ధలతో వీరెవరని అడిగాడు. హరి నరనారాయణులను గురించి వివరించగా యుద్ధం ఆపివేసి వెళ్ళిపోతాడు ప్రహ్లాదుడు. నరనారాయణులు మరల తపస్సులో నిమగ్నమైపోతారు

ఆ రోజులలో 'సహస్ర కవచుడు' అనే రాక్షసుడు ఉండేవాడు. అతి భయంకరుడు, క్రూరుడు. వాడివలన ముల్లోకాలకు ఉపద్రవాలు కలిగేవి. వాడిని సంహరించి ప్రశాంతవాతావరణమును నెలకొల్పాలని నరనారాయణులు భావించారు. నరుడు తపస్సుచేస్తుంటే నారాయణుడు యుద్ధం చేయటం, నారాయణుడు తపస్సు చేస్తుంటే నరుడు యుద్ధంజేస్తూ, ఆ రాక్షసుని 999 కవచములు తెగగొట్టారు. ఇక ఒక కవచం మిగిలిపోయిందట. వాడు మరణించి ఆ కవచంతోనే కుంతికి సూర్యునివలన కర్ణుడై జన్మించాడుట. ఈ నరనారాయణులే అర్జునుడు, కృష్ణుడుగా జన్మించి మరల ఆ కర్ణుని హతమార్చారు.

శౌనకుడు నరనారాయణులను సేవించి జ్ఞానమును పొందాడు. నారదుడడిగిన అనేక ప్రశ్నలకు సమాధానాలు చెప్పి సంశయనివృత్తిని చేసినారు. వేద విద్యాధికారము లేనివారు ఏఏ పనులు చేయవచ్చుని అడుగగా అన్నియూ వివరించి చెప్పి చివరకు "విష్ణు స్మరణమే ఉత్తమ" అని తెలియజేశారు. ఈ విషయాలను వినిన "శౌనకుడు" కూడా బ్రహ్మానందభరితుడైనాడు. నరనారాయణుల చరిత్ర వివరంగా "మత్స్యపురాణం" చదివిన తెలుస్తుంది. వారి చరిత్ర చిరస్మరణీయం.

---

"ఋషుల చరిత్రలు" శీర్షికను ఈ సంచికతో ముగిస్తున్నాం. ఈ వ్యాసములను అందించిన శ్రీ పురాణపండ 'శ్రీచిత్ర' గారికి కృతజ్ఞతాభివందనలు.

# కొమరగిరి కారాగార లేఖలు

(గత సంచిక తరువాయి)

సెంట్రల్ జైలు, రాజమండ్రి
ది 14-12-76

చిరంజీవులకు ఆశీస్సులు,

ఇంతకు పూర్వం వ్రాసిన లేఖలో "పరోపకారము" యొక్క విశిష్టతను వివరించాను. ఈ లేఖలో "నిరాడంబరము", "భూతదయ" ల ఆవశ్యకతను వివరిస్తాను.

## నిరాడంబరము

ప్రతి వ్యక్తి నిరాడంబరమైన జీవితాన్ని గడపడం అత్యవసరమని పెద్దలు చెబుతున్నారు. ఆడంబరంవలన వ్యక్తిత్వం ఏమాత్రం అభివృద్ధిజెందదు. ఏ వ్యక్తి అయినా సర్వ శక్తివంతుడైనప్పటికినీ, మిక్కిలి తెలివి గలవాడైనప్పటికినీ గొప్ప సంపద కలవాడైనప్పటికినీ మహా మేధావిఅయినప్పటికినీ, సకల శాస్త్రములను అధ్యయనం చేసిన మహాపండితుడైనప్పటికినీ - అట్టి వారిలో వినయ విధేయతలు, నిరాడంబరత గనుక లోపించిన యెడల ఏ మాత్రం వారు రాణించరు, శోభించరు ఉండవలసిన సద్గుణములు ఏ కొద్ది ఉన్నప్పటికీ, అసలు లేకపోయినప్పటికీ, అన్నీ వున్నట్లుగా నటన చేస్తుంటారు, ఫోజులు కొడుతుంటారు కొందరు. షోకులుచేసుకొని కులాసాగా, జల్సాగా, ఆడంబరంగా తిరుగుతుంటారు. తమకే అన్నీ తెలిసినట్లుగా 'షో' చేస్తుంటారు. అమాయకులు వారిని చూచి మోసపోతుంటారు అన్నీ వున్న విస్తరి అణగి మణిగే వుంటుంది. ఏమీ లేని విస్తరే ఎగిరెగిరిపడుతూ వుంటుంది అనే సామెత ఇట్టివారి విషయంలో యదార్థం. అన్నీ హంగులు గల సమర్థులు నిరాడంబరంగా జీవితాన్ని కొనసాగించిన యెడల వారి సమరత యింకా యినుమడిస్తుంది ఏ శక్తి లేనివారు ఆడంబరంగా ప్రవర్తిస్తే ప్రయోజనం శూన్యం కనుక ఆడంబరాలకు అవకాశం యివ్వకుండా, నిరాడంబరంగా జీవితాన్ని గడపటం ప్రతి ఒక్కరూ నేర్చుకోవాలి. "Simple living and high thinking" సామాన్యంగా, నిరాడంబరంగా జీవిస్తూ, ఆదర్శమైన, ఉన్నతమైన ఆలోచనలతో జీవితం గడపటం నేర్చుకోవాలి. నిర్మలమైన నిశ్చలమైన మనస్సు కలిగివుండాలి అట్టివారే సమాజంలో పేరు ప్రఖ్యాతులు, కీర్తిప్రతిష్ఠలు తెచ్చుకుంటారు.

## భూతదయ-

"సర్వభూతహితేరతాః" అని గీతబోధిస్తున్నది సమస్త ప్రాణకోటి యెడల దయ, ప్రేమ, కరుణలు కల్గి వుండాలి. భగవంతునిపై భక్తి, జీవరాసుల యెడల ద్వేషం కలిగివున్నచో, ఆ భక్తికి అర్థమే లేదు. అది అపచారమే అవుతుంది. సమస్త ప్రాణులూ భగవత్స్వరూపులే. కనుక ఏ ప్రాణికీ అపకారంతలబెట్ట రాదు, బాధించరాదు "సర్వజీవ తిరస్కారః కేశవం ప్రతిగచ్ఛతి" ఏజీవిని తిరస్కరించినా, బాధించినా భగవంతుని బాధించినట్లే అవుతుంది. కనుక సర్వజీవుల యెడల దయకల్గివుండవలెను "ఎవరు ధ్యానము, దైవభక్తి, దైవజ్ఞానములతో పాటు సమస్త ప్రాణుల యెడల ప్రేమ దయ కలిగి వుంటారో అట్టి వారు నన్ను తప్పకుండా పొందుతారు" అని శ్రీ కృష్ణపరమాత్మ అర్జునునితో చెప్పారు కనుక సర్వభూతదయకూడా పరమోత్కృష్టమైన ధర్మములలో ఒకటి

"నిర్వైరస్సర్వభూతేషు" అన్నది గీత మనధర్మశాస్త్రములలో ఒక్క మనుజులకేగాక, సమస్త

ప్రాణకోటికి కూడా ఎటువంటి ఉన్నతమైన స్థానం యివ్వబడిందో, దీనిని బట్టి అర్థం చేసుకొన వచ్చును. ఇటువంటి అత్యున్నతమైన తత్త్వజ్ఞానం (Philosophy) ప్రపంచంలో మరెక్కడా కనిపించదు. "సర్వభూతదయ" అన్నారుగదాయని చాదస్తంగా మాత్రం ప్రవర్తించరాదు. కొన్ని కొన్ని సమయాలలో వివేకం, విజ్ఞతను ప్రదర్శించవలసి వస్తుంది. జీవహింస చేయరాదని, పంటలను ధ్వంసం చేసే క్రిమికీటకాలను కూడా సంహరించరాదనే స్థాయికి పోరాదు. అసలు పంటలు బాగా పండుతేనేగదా మానవజాతి మనుగడ వుండేది అందుకని అనవసరంగా ఏ జీవిని హింసించరాదు. ఏది చేస్తే ఎక్కువ ప్రయోజన ముంటుందో వివేకంతో ఆలోచించి నిర్ణయాలు గైకొనాలి. ఆ కారణంగా ప్రాణులను హింసించరాదు కుంటిసాకులు చెప్పి హింసకు పూనుకోవటం ధర్మం కాదు ఉత్తమ ధర్మమేదో, ఏ పని చేస్తే సమాజ శ్రేయస్సుకు తోడ్పడుతుందో, విజ్ఞతతో ఆలోచించి చేయాలి. స్వార్థంతో, సంకుచితత్వంతో, స్వలాభ దృష్టితో ఇతర ప్రాణులను మాత్రం హింసించరాదు. కనుక ప్రతి విషయంలోనూ వివేకంతో ఆలోచించి, విజ్ఞతను ప్రదర్శించాలి.

కనుక నిరాడంబర జీవితాన్ని గడుపుతూ సమస్త ప్రాణులయెడ దయ, ప్రేమ, కరుణలను ప్రదర్శిస్తుంటారు గదా !

ఇక వుంటా ......

ఇట్లు
మీ 'నాన్న'

---

ప్రసిద్ధ గాయని

# లతామంగేష్కర్

## పఠించే శ్లోకం

శుభం కరోతి కల్యాణం
ఆరోగ్యం ధనసంపదా
దుష్టవృత్తి వినాశాయా
దీపజ్యోతి నమోస్తుతే ॥

జ్యోతిస్వరూపుడైన (సూర్య) దేవా ! కళ్యాణ ప్రదమైన శుభములను చేకూర్చుము. ఆరోగ్యము, ధనసంపదల నిమ్ము. మాలోని దుష్టప్రవృత్తులను నశింపజేయుము. జ్యోతిస్వరూపుడవైన నీకివే మా నమస్సులు.

( ఈ మధ్య హిమాచలప్రదేశ్‌లో నేను పర్యటన చేస్తుండగా ఆస్థికుడైన గుజరాతీ వ్యాపారస్థుని అతిధిగా నేనుండగా ఆ ఇంటిలోని వారందరూ తరచు ఈ శ్లోకం పఠించటం చూచినాను. లతామంగేష్కర్ ఈ శ్లోకము ను పఠించుచూ అనేకమందికి అనుదినం ఉచిత భోజనాలు అందచేస్తూ, ఆమెకు ఇష్టమైన ఈ శ్లోకం పఠిస్తుందని ఆయన నాకు తెలిపారు.

సేకరణ : డా॥ రాపర్ల జనార్ధనరావు

# ఆహారం - అలవాట్లు

-పాతూరి ప్రసన్నం

తీగ లాగితే కంప అంతా కదులుతుంది. అలాగే ఏ విషయం మీదకు మనస్సు పోనిచ్చి, కాస్త లోతుగా ఆలోచించినా, అక్కడ ఆధ్యాత్మికత అనేది కనబడి తీరుతుంది. కనుకనే అన్ని విద్యలకూ మూలం ఆధ్యాత్మిక విద్య అన్నారు

ఈ వ్యాస పరంపరలో యిది చివరి వ్యాసం అయినా, దీనికిగల ప్రాముఖ్యత ఎంతో ప్రధానమయినది, ప్రప్రథమంగా గమనించవలసినదీ కూడా.

మనం ఆధ్యాత్మికత పేరుతో ఎంతో చదువుతాం, వింటాం! కానీ ఆచరణ ఎక్కడ ప్రారంభించేది తెలీదు. అది మన ఆహారపు అలవాట్లతోనే ప్రారంభం అవుతాయని మహనీయుల జీవితాలు చదివితే తెలుస్తుంది.

మన బ్రతుకునకు ఆధారమైన అన్నం తినటం అమ్మే నేర్పుతుంది. భౌతికమైన శరీరానికి, బ్రతుక్కి అన్నం ఎంత అవసరమో, మన మానసికమైన వికాసానికీ, తద్వారా మనలో ప్రతిబింబించే ఆనందానికీ, అనేకమైన దివ్యానుభవాలకు కూడా మనం తీసుకొనే అన్నం అంతే అవసరం. ఒక్క మాటలో చెప్పాలంటే మన లౌకిక జీవితానికీ, ఆధ్యాత్మిక ఉన్నతికీ, వికాసానికీ కూడా అన్నమూ, అన్నమును తీసుకునే విధానం అంత ప్రముఖమైనది, ప్రధానమైనది

బరువులు మొయ్యవలెనన్నా, బండ పనులు చేయవలెనన్నా బాగా తిండి పుష్టి కావాలి కానీ మనోవికాసానికీ ఆత్మానుభూతికీ తిండి పుష్టితో పనిలేదు "Man the unknown" అనే గ్రంథంలో బయాలజీలో నోబుల్ బహుమతి గ్రహీత అయిన శ్రీ ఎలెక్సిస్ క్యారెల్ ఈ మాటే అంటారు "కరతల భిక్ష" తోనే ఆదిశంకరులు జీవించారు అంతటి మేధావిని ప్రపంచం యింతవరకూ చూడలేదు రాగి సంకటిని, ఒక గ్లాసు పరిమాణంలో ఒక్క పూటే తీసుకొని, ఒక గ్లాసు **మజ్జిగ తీసుకుంటారు భగవాన్ శ్రీ సత్యసాయి బాబా.** డిఫెన్సు సయింటిస్టు శ్రీ సూరి భగవంతంగారు బాబావారు తీసుకొనే ఆహారపు "క్యాలరీ" విలువను గూర్చి వ్రాశారు. ఎంతో తక్కువ "క్యాలరీల" ఆహారాన్నే బాబా తీసుకుంటారు. కానీ మనం చేసే పనికి ఎన్నో రెట్లుగా శారీరకంగా పనిచేస్తారు. ఇంతవరకూ 68 సంవత్సరాల వయస్సు వచ్చినా కూడా బాబావారిలో శారీరకంగా ఏ అలుపూ సొలుపూ ఎవ్వరికీ కనబడలేదు అలాగే గాంధిమహాత్ముని భోజనం కూడా చాలా సింపుల్‌గా వుండేది

ఈ అంశాన్ని పరిశీలిస్తే మనం ఈనాడు తీసుకొనే తిండి ద్వారానే మనం అనేకమైన అనారోగ్యాలకూ, మానసిక రుగ్మతకు బలి అయిపోతున్నామని అంగీకరించక తప్పదు. కాబట్టి అతిగా ఆధ్యాత్మికం మీద చదవటం, వినటం, మాట్లాడటం తగ్గించి, మనం తీసుకొనే ఆహారం ద్వారా మనకుగల ఆధ్యాత్మిక, మానసిక శక్తులను పెంచుకోవటానికి బాల్యం నుంచీ ఒక సాధన స్వీకరించాలి - అప్పుడే మనం చేసే తపోధ్యానాలూ, సాధనలూ ఫలిస్తాయి. లౌకికమైన శక్తి సామర్థ్యాలు పెంపొందుతాయి.

## తినటం - తిరగటం

" పుట్టుట ఒక యేడ్పు పుణమినుండుట యేడ్పు
తిండి లేక యేడ్పు, తినక యేడ్పు
యేడ్పు లేనిదెప్పుడు యిహా జీవితంబున ? "

అని ప్రశ్నిస్తారు బాబా. తిండి లేక కొందరు యేడుస్తుంటే తిండి అరగక కొందరు యేడుస్తున్నారు. అసలు బ్రతకటం కోసం మాత్రమే తినాలనే గుర్తింపు చాలా తక్కువ మందిలోనూ, మనం పుట్టింది తినటం కోసం, బ్రతికేది తినటం కోసమూ అనే భ్రాంతి చాలామందిలోనూ వుంటుంది. అదే మన దుఃఖానికి కారణం, మూలం. కాబట్టి ఎన్నో దుఃఖాలకు మూలమైన ఈ అపోహలను తొలగించితే సుఖపడుతాం. శ్రీ కృష్ణభగవానుడు భగవద్గీతలో చెప్పిన సుఖ జీవిత రహస్యం యిదే. Secret of Happiness యిదే

యుక్తాహార విహారస్య యుక్త చేష్టస్య కర్మసు
యుక్త స్వప్నావ బోధస్య యోగీ
భవతి దుఃఖహా ।

మనం తిండి విషయంలోనూ, తిరుగుడు విషయంలోనూ పనులు చేసే తీరులోను, నిద్ర విషయంలోనూ సముచిత రీతిలో ప్రవర్తించాలి, వ్యవహరించాలి. Be Always Moderate Never go to excesses అంటారు. బుద్ధదేవుడు దీన్నే మధ్యేమార్గం అన్నారు. ఈనాడు మనం Food Habits కు ఒక హద్దు పద్దు వుండటం లేదు. ఎక్కడ పడితే అక్కడ, ఏది పడితే అది తినటానికి అలవాటు పడిపోతున్నాం అనేక రకాల జీర్ణకోశ వ్యాధులకు బలిఅయిపోతున్నాం. పశు పక్ష్యాదులూ తింటున్నాయి, త్రాగుతాయి. కానీ వాటికి మనం పొందే దురవస్థలూ, కడుపు జబ్బులు, డాక్టర్లు, నర్సింగ్ హోంలూ లేవు. మనకే ఏ సీజనూ లేదు, ఏ రీజనూ లేకుండాపోతోంది.

చెత్త కుండీలో చెత్త పడవేస్తూపోతే అది బాగా పెరిగిపోతుంది. మన పొట్టలో కూడా అలా తిండి పడవేయటమే ప్రధాన లక్ష్యంగా బ్రతుకుతూ వుండటం చేత, మన శరీరములో అలా పెరిగిపోతున్నాయి. అతి తిండి మతి హాని. మనం తినే అధిక తిండివల్ల శరీరంలో టాక్సిన్సు, క్రొవ్వులూ పేరుకుపోయి నానారకాల రోగాలు మనకు సంక్రమిస్తున్నాయి. మనకుగల శారీరక మానసిక శక్తులు కృశించిపోతున్నాయి, నశించిపోతున్నాయి.

"తెలివైన వారు తక్కువ తింటారు, ఆధ్యాత్మిక సాధకులు సగమే తింటారు, మహర్షులు కేవలం బ్రతకటం కొరకే తింటారు. పొట్టకు దాసులై, జిహ్వకు బానిసలై తమ చేతులకూ, కాళ్ళకూ సంకెళ్ళు తగుల్చుకుంటున్నారు మూర్ఖులు. ఈ రీతిగా జిహ్వకు బానిసలు అయినవారు దైవానికి భక్తులు కాలేరు" అంటారు పార్శీ దేశపు తత్త్వవేత్త అయిన సాదీ అనే మహానుభావుడు.

వేళకి ప్రార్థన చేయటం ఎంత అవసరమో వేళకి తిండి తినటం కూడా అంత ప్రధానం. దైవానికి నివేదన చేయటం ఎంత పవిత్రంగా చూస్తామో పవిత్రమైన ఆహారాన్ని మన కడుపులో గల వైశ్వానరునికి నివేదన చేయటం కూడా అంత అవసరం.

## ఆహార కాలుష్యం

కలుషితమైన ఆహారాలు, బ్రాందీ, సారాలూ తినటం చేత, త్రాగటం చేత ఎన్ని దుర్మరణాలు సంభవిస్తున్నాయో లెక్కలేదు. అందుకే మన కిచన్ గార్డెన్‌లో తోటకూర, వంటి ఆకుకూరలనూ స్వచ్ఛమైన కూరగాయలనూ పండించి తినటం ఎవరికి వారే చేసుకోగలిగిన గొప్ప సేవ. మాంసాహారం అన్ని విధాలా విడిచిపెట్టదగినదే. కనుకనే విదేశాలలో కూడా శాకాహార సమాజాలను స్థాపించి "విజిటేరియన్" భోజనాలనే ప్రోత్సహించే సంఘ సంస్కర్తలు బయలుదేరారు. శాకాహారోద్యమం కూడా ఈనాడు బాగా ప్రచారంలోకి వస్తోంది.

కలుషితమైన ఆహారం అంటే మనం తినే అన్నం కలుషిత పదార్థాలతో కలుషితం అయిపోయింది అనుకుంటాం. అంతే కాదు. అన్యాయార్జితంగా, అక్రమ సంపాదనతో పాపకృత్యాల ద్వారా సంపాదించిన ధన ధాన్యాలు కూడా అపవిత్రమైనవే, కలుషిత

మైనవే. ఈనాడు ఇటువంటి కలుషితమే సర్వే సర్వత్రా కనబడుతోంది. అధర్మాచరణ ద్వారా మనం సంపాదించే ధనం ( అరవంలో " దుడ్డు " అంటారు ) అటువంటి "దుడ్డు"తో మనం పొందే "వుడ్డు" ( తిండి ) తద్వారా మనలో ప్రవహించే " బ్లడ్డు " అన్నీ కాలుష్యాన్ని ప్రసారం చేసేవే కనుకనే దుర్యోధనుని పాపపు కూడు తిన్నంతకాలమూ భీష్మాచార్యులవారు ధర్మం, న్యాయం తెలిసి కూడా చెప్పి, చేయించలేకపోయాడు. అంపశయ్యమీద పడుకున్న తరుణంలో ఈ కలుషిత రక్తంకారిపోవటం చేత స్వచ్ఛమైన జీవిత తత్వాన్ని బోధించాడుట. ఈనాడు ఎంత వేదాంతం చదివినా మనలో ఈ రీతిగా కలుషితమైన రక్తం ప్రవహిస్తున్నంతకాలమూ ఆధ్యాత్మిక సాధనల యొక్క నిజమైన అనుభవాలను పొందలేని వారమే అయిపోతాం

ఈనాడు ప్రతి ఒక్కరిమీదా దుర్గుణాల ప్రభావం చాలా ఎక్కువగా వుంటోంది 'అతడు భక్తుడే ! కానీ అతనిలో ఫలానా దుర్గుణం వుంది " అనే పరిస్థితి చూస్తున్నాం. దీనికి కారణం మనలో సత్వగుణ సంపదను ప్రోత్సహించి, పోషించే ఆహారాన్ని తీసుకోలేని బలహీనతే. మానవుడు త్రిగుణములు అనే సంకెళ్ళ చేత బంధింపబడినట్టివాడు తమోగుణం, రజోగుణం, సత్వగుణం అనే మూడు గుణాలూ మూడు విధములైన ఆహార పదార్థాల ద్వారా మనలో పోషింపబడుతూ వుంటాయి. మనిషి అంటే గుణమే. గుణంలో ఏనాడు హీనత కలుగుతుందో మనుష్యత్వంలోనూ హీనత కనబడుతుంది. ఈ రీతిగా మనలోని గుణాలను పోషించేవి మనం తినే అన్నపానీయాలే. భగవద్గీతలోని గుణత్రయ విభాగయోగంలో ఎటువంటి ఆహారం తింటే ఎటువంటి గుణాలు మనలో కలిగేదీ వివరింపబడింది ఒక రాత్రి గడిచినవీ, చల్లనివీ, పాచిపోయినవీ, మత్తు కలిగించేవీ అయిన ఆహార పానీయములను గూర్చి తమోగుణం మనలో పెంపొందించేవిగా భగవద్గీత చెబుతుంది. వీటిని తీసుకోవటంచేత నిద్ర మత్తుగా వుండడం, సకాలంలో విధులు నెరవేర్చలేకపోవటం, తప్పును ఒప్పుగానూ, చెడును మంచిగానూ విపరీత ధోరణిలో ఆలోచిస్తూ, పనిచేయటం, దానివలన ప్రమాదం, ఆత్మవినాశనం సంభవించటం జరుగుతుంది. అదే దుఃఖహేతువు. పతన హేతువు. బంధహేతువు. అజ్ఞానహేతువు. ఇది తెలిసీ మనం, మనం యిష్టం వచ్చినట్లుగా మత్తు పదార్థాలు సేవిస్తున్నాం. తమోగుణం పెంచే పదార్థాలు తీసుకుంటున్నాం.

అలాగే కారం, పులుపు, ఉప్పు అధికంగా కలిగి బాగా నూనెలతో వండినవి, వేయించినవీ అధికంగా దాహం కలిగించేవీ అయిన పదార్థాలు మనలో రజోగుణాన్ని వృద్ధిచేస్తాయి. రజోగుణంచేత పిచ్చి పిచ్చి కోరికలు పుట్టుతూవుంటాయి. మనస్సు చంచలమై పోతుంది అగ్నిజ్వాలలు లాగా కోరికలు విజృంభిస్తూ వుంటే వాటిని తీర్చుకోవటంకోసం చేయరాని పనులు చేస్తాం. హద్దుమీరిన కోరికలతో మతిభ్రష్టులం అయిపోతాం పెడదారిన పడిపోతాం. మిర్చి బజ్జీలు "ఛాట్ భాండార్" పదార్థాలు (యివి చాలా పుల్లగా వుంటాయి) డ్రింకులూ, వగైరా పదార్థాలన్నీ మనలో రజోగుణాన్ని వృద్ధిచేస్తున్నాయి. తమోగుణం నిద్రని, అధోగతిని, అజ్ఞానాన్నీ కలిగిస్తే; రజోగుణం అశాంతినీ, అహంభావాన్నీ, దుర్మార్గాన్నీ బాధలనూ భయాలనూ పెంపొందిస్తుంది కానీ మనం ఇటువంటి రజోగుణపదార్థాలనూ తింటూనే వుంటాం. ఆధ్యాత్మిక సాధకులమని చెప్పుకుంటూనే వుంటాం.

ఇక సత్వగుణాన్ని పోషించేవన్నీ శాకాహారాలు. ఆకుకూరలు, పాలు, పళ్ళు. అవి తేలికగా జీర్ణమవుతాయి. వీటిని తీసుకోవటం చేత మనోబలం పెరుగుతుంది బుద్ధికి స్థిరత్వం యేర్పడుతుంది, జ్ఞానం పెంపొందుతుంది. నిజమైన సుఖం ఏమిటో అనుభంలోకి వస్తుంది జీవితంలో ఉన్నతి లభిస్తుంది. కానీ ఎంతమంచి సాత్వికాహారం తీసుకుంటున్నాం.

### అపవిత్ర ఆహారాలు

రజోగుణాన్ని, తమోగుణాన్ని పెంచేవి అపవిత్ర

మైన ఆహారాలు. సత్వగుణాన్ని పెంచేవి పవిత్రమైన ఆహారాలు "అన్నం పరబ్రహ్మస్వరూపం" అన్నారు. వేదాల్లో "అన్న సూక్తం" వుంది దానిని పఠించి అన్నంయొక్క పవిత్రతను పోషిస్తారు శ్రోత్రియులైన వారు మన నిత్యజీవితంలో ఈ దిగువ చెప్పిన సాధనల ద్వారా అన్నం అత్యంత పవిత్రమవుతుంది.

1) బియ్యం గింజలను బాగుచేస్తూ దైవనామాన్ని స్మరించటం 2) కూరలు తరుగుతూ దైవాన్ని స్మరించటం 3) వంట వండుతూ దైవాన్ని స్మరించటం. 4) దైవానికి నివేదన చేసి వడ్డించటం. అన్నం తిన బోయే ముందు ఈ శ్లోకాలనూ, మంత్రాన్నీ జపించటం.

బ్రహ్మార్పణం బ్రహ్మహవిః ।
బ్రహ్మాగ్నౌ బ్రహ్మణా హుతం ।
బ్రహ్మైవ తేవ గంతవ్యం ।
బ్రహ్మకర్మ సమాధినా ॥

* * *

అహం వైశ్వానరో భూత్వా ।
ప్రాణినాం దేహమాశ్రితః ।
ప్రాణాపాన సమాయుక్తః ।
పచామ్యన్నం చతుర్విధం ॥

* * *

ఓం అసతోమా సద్గమయ ।
తమసోమా జ్యోతిర్గమయ ।
మృత్యోర్మా అమృతంగమయ ॥
ఓం శాంతిః శాంతిః శాంతిః ॥

5) అన్నంతింటూ వుండగా కోపతాపాలకూ, దిగుళ్ళ చింతలకూ, క్రూర ఘోరమైన మానసిక ఉద్వేగాలకూ మనలో చోటివ్వకూడదు. 6) ప్రేమ భావంతో, శాంత స్వభావంతో సంతోషాన్ని పంచుకుంటూ నెమ్మదిగా తక్కువగా మాట్లాడుతూ భోజనం చేయాలి. వీటి వలన పాత్రశుద్ధి, పాకశుద్ధి, పదార్థశుద్ధి, పంక్తిశుద్ధి సహజంగానే లభిస్తాయి.

ఇటువంటి విధానాలు అవలంబించకపోగా, ఈనాడు మన డైనింగ్ టేబులుకు ఎదురుగా ఒక కలర్ టి వి. పెట్టించి దానికి స్టార్ టి. వి కలిపి అందులోని వికృతమైన పాటలను వింటూ, వికారమైన దృశ్యాలు చూస్తూ, మానభంగాలూ, మర్డర్లు తిలకిస్తూ భోజనం చేస్తున్నాం. దీనివల్ల మన మానసిక స్థితి చాలా కలుషితమైపోతుంది తద్వారా తినే అన్నం యొక్క ప్రభావం కూడా కలుషితమైపోతుంది. అమెరికాలో చాలా ప్రఖ్యాతిని గడించిన రాక్‌ఫెల్లర్ భోజనం అలవాట్లు చూడండి. ప్రశాంతమైన వాతావరణంలో, దైవప్రార్థనా గీతాలను వింటూ, అతి వేడి, అతి చల్లదనం లేని సమశీతల పదార్థాలనే భుజిస్తూ ఆరోగ్యంగా 90 సంవత్సరాలు పైబడి దృఢంగా జీవించాడు. ఆహారంలో విటమిన్లు, ప్రొటీన్లు వుంటేనే కాదు, ఈ రీతిగా ఆధ్యాత్మికమైన "పిల్స్" కూడా భోజనంతో పాటు వేసుకోవాలి అంటారు శ్రీ నెపోలియన్ హిల్.

భోజనంలో వేసుకొనే మన "కర్రీ" లు తినటంలో "హర్రీ" అంటూ అనుభవించే "వర్రీ" ఇవన్నీ మనల్ని అనారోగ్యంపాలు కావిస్తున్నాయి అంటారు భగవాన్ శ్రీ సత్యసాయి బాబా.

"ఆత్మారామం" 22 వ అధ్యాయంలోనూ, "గీతా వాహిని" 26 వ అధ్యాయంలోనూ భగవాన్ బాబావారు మనకెన్నో ఆహార సంబంధమైన విశేషాలు చెబుతారు.

పూర్వం మనవాళ్ళకు అన్నం వండటం ఒక కళ, వడ్డించటం ఒక కళ, తినటమూ ఒక కళగానే భావించారు, అందుకే పంక్తి భోజనాల్లో "స్వర్గ కవాట పాటన కళీ మాతా అన్నపూర్ణేశ్వరీ" అంటూ దైవ నామ స్మరణతో భోజనం చేసేవారు. ఇవన్నీ చాదస్తపు అలవాట్లు అనుకుంటున్నారా ?

## నిషిద్ధమైన ఆహారాలు

నిషిద్ధములు అంటే కూడనివి, పనికిరానివి, నిషేధింపబడినవి అని అర్థం. మాంసాహారాన్నీ, మద్య

పానాన్నీ నిషిద్ధములుగా గుర్తించారు. ఈనాటి సైన్సు కూడా మాంసాహారంలోకంటే శాకాహారంలోనే ఎక్కువ సుగుణాలు వున్నాయని ఋజువు చేస్తోంది మహాభారతం లోని అనుశాసనిః పర్వం యిలా చెబుతోంది :

"ప్రాణులను చంపితేగానీ మాంసం రాదు కనుక అట్టి మాంస భోజనాన్ని విసర్జించుతూ, తద్వారా జీవ హింసను విడనాడిన వ్యక్తిని పంచభూతములూ రక్షిస్తాయి."

"మాంసం తినే మనిషి రాక్షసునితో సమానం దేవతలు మాంస భక్షకులు కాకపోవటంచేతనే, రాక్షసుల పైన అంతిమ విజయం సాధించారు."

"మాంసం అనే దానిని తినేవారు తినవలసివస్తే తిన వచ్చును. గానీ, ఆషాఢమాసంలో, శ్రావణంలో, భాద్రపద, ఆశ్వీయుజ మాసాల్లో మాత్రం పూర్తిగా మాంసభక్షణ వర్జించాలి. అలా చేయటంవల్ల ఆయు రారోగ్యములు, బలకీర్తులు లభిస్తాయని దిలీపమహారాజు, భగీరథ చక్రవర్తుల చరిత్రలు నిరూపించాయి", అంటుంది మహాభారతం.

అలాగే మద్యపానాన్ని గూర్చి మహాభారతం చాలా ఘాటైన సందేశం యిస్తుంది :

"పూర్వజన్మలలో చేసుకున్న పుణ్యం ద్వారా పొందిన జ్ఞానం అంతా ఒక్కసారి చేసిన మద్యపానంతో హరించిపోతుంది". (ఆదిపర్వం)

ఇటువంటి మద్యపానం ఒక భయంకరమైన వ్యాధి వంటిది. దాన్ని వదిలించుకోవటం అంత తేలికకాదు, అని చెబుతూనే శ్రీ నెపోలియన్ హిల్ కొన్ని వదిలించుకొనే చిట్కాలు వివరిస్తారు పాత సహవాసా లకు దూరం కావటం, సత్పురుషులతో కలవటం, పరిసారాలలోకూడా పవిత్రమైన మార్పులు తీసుకు రావటం, మత, ఆధ్యాత్మిక సంబంధమైన వ్యాపకాలతో బ్రతకటం అనే సూచనలను శ్రీ నెపోలియన్ హిల్ సూచిస్తారు : ఈ విషయంలో భగవాన్ శ్రీ సత్యసాయి బాబావారి దివ్యప్రభావం ఎంతమందిని De-wine చేసి, వారిలో Divine పరిణామం తెచ్చిందో శ్రీ సత్యసాయి సారస్వతం చదివితే తెలుస్తుంది !

## ఉపవాసాలు

నేటి యువతరానికి శనివారం ఉపవాసాలు అంటే అన్నం బదులు ఇడ్లీసాంబారు, మస్కామసాలా దోసె వంటివి తినటం ఒక Change of Diet గా మాత్రమే తెలుసు. భగవంతుని ఆరాధనలో దైవానికి సమీపంగా (ఉప) వుండటాన్ని (వసించటాన్ని) ఉపవాసం అంటారు ఈనాడు ఉపవాసాన్ని రష్యాలోనూ, యింకా అన్ని దేశాల్లోనూ ఒక చికిత్సా విధానంగా రూపొం దించారు Fasting వల్ల (ఉపవాసం వలన) 1) శరీరంలోగల 'టాక్సిన్సు' రూపంలోని విషపదార్థాలు నశిస్తాయి 2) శరీరంలోగల హార్మోనులను ఉత్పత్తిచేసే గ్రంథులు చురుకుగా పనిచేసి ఆరోగ్యాన్నివృద్ధిచేస్తాయి. 3) ఉపవాసంవల్ల శరీరంలోని కణాలలో క్యాన్సర్ వంటి రోగగ్రస్తమైన జీవకణాలు నశించి ఆరోగ్యకరమైన జీవాణువులు ఉత్పత్తి చెందుతాయి. "Fasting changes the structure of cancer cells The law of Metabolism or breaking down cell-structure and re-building it with new cells is based on the theory of Fasting", అంటారు ప్రొఫెసర్ యూరీ నికోలేవ్ "Fast and enjoy life" అనే రచనలో. షిరిడీ సాయిబాబాగానీ, శ్రీ సత్యసాయిబాబావారు గానీ ఉపవాసాలు ఉండటాన్ని గొప్ప ఆధాత్మిక సాధనంగా బోధించలేదు. "యుక్తాహారం" అన్నారు. ప్రతిరోజు చాలా నియమంగా అతి భోజనం కాకుండా, మితంగా భుజిస్తే అది నిత్యోపవా సంతో సమానం అన్నారు. మిత భోజనం ద్వారా ఈ వ్యాస రచయితకు అనేకమైన మంచి అనుభవాలు కలిగాయి. మిత భోజనం పాటించే వారందరికీ ఈ అనుభవాలు తప్పక కలుగుతాయి.

## సాధన

మనం తిన్న ఆహారం 24గంటలలో రక్తంగామారి

మన ఆలోచనల యొక్క రూపం ధరిస్తుంది. "మనం భుజించే ఆహారం చేత మన భవిష్యత్తు యొక్క ఫలితములు, మనసు అనేక విధములుగా వెంటాడుతూ వస్తున్నాయి మనము ఎట్టి ఆహారమును భుజిస్తామో అట్టి భావములే మనలో ఉద్భవిస్తూ వుంటాయి అంతేకాదు — భుజించే సమయంలో ఎట్టి మాటలతో కాలం గడుపుతామో, అట్టి భావములే మనలో ఆవిర్భవిస్తాయి. పరులకు సంబంధించిన ఉద్రేకములైన మాటలు మాటాడుతూ మనం ఆహారం భుజించటం చేత, మనలో కూడా అలాంటి ఉద్రేకములైన భావములు చెలరేగుతూ వుంటాయి. కనుకనే మనము భుజించే సమయంలో ఏ విధమైన మాటలకు అవకాశం యివ్వకూడదని శాసించారు. భోజన సమయంలోని అతి మాటలు మనకు హాని కలిగిస్తాయి" అంటారు భగవాన్ శ్రీ సత్యసాయి బాబా (ఆత్మారామం పేజీ 319)





మన ఆధ్యాత్మిక సాధన యొక్క స్వరూపం మనం అన్నం తినే విస్తరిలోనే కనబడుతుంది అంటారు అనుభవజ్ఞులు. వేదాంతం చెబుతూ ఊరగాయలు, ఆవకాయ చట్నీలు, పండుమిరపకాయ కారం చట్నీలు వగైరా భుజించే వారి సాధన అంతా కేవలం మాటలకే పరిమితంఅని తెలుసుకోవాలి. మన నిత్య జీవితంలో " Food from the divine" అనగా "దైవం పంపిన ఆహారం" అనే అవకాశం కూడా వుంది మనం మనకొరకు అన్నం వండుకుంటే అది "దొంగ" తనం అవుతుంది అది పాపాన్ని వండుకుని తినటం అవుతుంది అంటుంది గీతామాత. "యజ్ఞ శిష్టము"ను తింటే అదే అమృతం అవుతుంది పదిమంది శ్రేయస్సుకు, సుఖానికీ మనకున్నంతలోనే ఖర్చుపెట్టాలి. మిగిలినది తినాలి. భగవాన్ శ్రీ సత్యసాయి బాబావారి భక్తులు "నారాయణ సేవపేరు"తో దరిద్రనారాయణులకు అన్నం పెట్టి తాము భుజిస్తూవుంటారు. దీన్నే దైవం పంపిన ఆహారం అని వర్ణిస్తారు మరొక మహానుభావులు. నిత్య జీవితంలో ఆధ్యాత్మికత అనేది మనం తిండిని తినటంలోనే కాక, యితరులకు భోజనం పెట్టటంలో ప్రతిబింబిస్తుంది

ఆదరంతో, ప్రేమతో, సాక్షాత్తు దైవం మన యింటికి వచ్చి భుజిస్తున్నాడన్న భావంతో అతిథి, అభ్యాగతులకు సేవ చేయాలి. ఒక గ్లాసుతో మంచినీళ్లు యిచ్చినా, ఒక పూట అన్నంపెట్టినా మన సంస్కారం అందులో కనబడుతుంది ఏమి పెట్టామో ప్రధానం కాదు. ఎటువంటి గౌరవ భావంతో, ప్రేమ భావంతో, ఆదరభావంతో పెట్టామో నేర్చుకోవాలి.

ఆహారం అంటే అది కడుపుకోసం నోటితో తినే అన్నమే కాదనీ, ప్రతి యింద్రియము లోనికి స్వీకరించే ప్రతి విషయమూ ఆహారమేననీ గుర్తించాలి. మంచి దృశ్యం నేత్రానికి ఆహారం. మంచి మాటలు, పాటలు, ప్రార్థనలు, మంత్రాలు చెవికి ఆహారం; సుగంధాలు ముక్కుకు ఆహారం; చల్లని స్పర్శ చర్మానికి ఆహారం. కనుక ఈ కర్మేంద్రియాలూ, జ్ఞానేంద్రియాలూ తమ అనుభవాన్ని మంచి విషయాలపై మాత్రమే కేంద్రీకరించి బ్రతికితే అదే ఉత్తమమైన సాధన. దుర్విషయాలను అనేకమైన వాటిని స్వీకరిస్తూ మన యింద్రియాల యొక్క పవిత్రతను భగ్నం చేసుకోవటమే ఈనాటి మన దుస్థితికి కారణం.

---

నిత్య జీవితంలో ఆధ్యాత్మికం అనే శీర్షికను నిర్వహించిన శ్రీ పాతూరి ప్రసన్నంగార్కి కృతజ్ఞతాభివందనలు. ఇది చివరి వ్యాసం. శ్రీ ప్రసన్నంగారి కలం నుండి మరో క్రొత్త శీర్షిక ఫిబ్రవరి '94 నుండి ప్రారంభం కాబోతున్నదని శ్రీవాణి పాఠకులకు తెలియపరచుచున్నాము.

# ధర్మరాజు గొప్పతనం

-కవుల ఆంజనేయశర్మ

ఒక బ్రాహ్మణుడు నిప్పు పుట్టించే తన కర్ర కొయ్యను ఒక మృగము ఎత్తుకొని పోతోందని, దాన్ని తెచ్చి తనకు యిప్పించమని వనవాసం చేస్తున్న పాండవులను కోరాడు. అతని కోరికను మన్నించి ఆ మృగాన్ని పట్టి తేవడానికి పంచపాండవులు బయలు దేరారు. మృగము కొంచెం దూరం పోయి మాయ మైంది పాండవులు అలసిపోయి విశ్రమించడానికై ఒక చెట్టు నీడను చేరారు. వారికి దాహం వేసింది. మంచినీటికై ధర్మరాజు నకులుణ్ని పిలిచి దగ్గర్లో నీరు ఉందేమో చూచిరమ్మన్నాడు నకులునికి నీటి కొలను కనిపించింది. అందులోకి దిగి నీరు త్రాగుచుండగా "ఈ కొలను నాది. నేను వేసే ప్రశ్నలకు సరియైన జవాబు చెప్పి, ఆ తర్వాత నీళ్ళు త్రాగు" అనే ధ్వని వినిపించింది నకులుడు ఆ మాటల్ని లెక్కచేయ లేదు. నీళ్లు త్రాగి తెలివి తప్పి పడిపోయాడు.

నకులుడు రాకపోవడంతో సహదేవుణ్ని, భీముణ్ని, అర్జునుణ్ని ఒకరి తర్వాత ఒకర్ని పంపించాడు ధర్మ రాజు వాళ్ళుకూడా నకులునిలాగే జవాబివ్వక నీళ్ళు త్రాగి తెలివితప్పి పడిపోయారు.

చివరకు ధర్మరాజు స్వయంగా వెళ్లాడు. పడిపోయిన తమ్ముళ్ళను చూసి ఎంతో విచారించాడు. దాహం తీర్చుకోవటానికై కొలనులోకి దిగుచుండగా "నే నొక యక్షుడను. నా ప్రశ్నలకు సమాధానం చెప్పి, తర్వాత నీరు త్రాగు లేనిచో నీ తమ్ముల గతే నీకు పడుతుంది" అని పలికెను.

యక్షుడు అడిగిన ప్రశ్నలకు ధర్మరాజు చాలా తెలివిగా ఈ విధంగా జవాబులు యిచ్చాడు.

"పరదేశంలో ఉన్నవారికి మిత్రుడు – విద్య"

"గాలి కంటే వేగము కలది – మనస్సు"

"భూమి కంటే బరువైంది – తల్లి"

"సుఖములన్నిటిలోకి ఉత్తమ సుఖము-సంతృప్తి"

"గర్వమును విడుచువాడు అందరకును- ఇష్టుడగుతాడు"

"ఉత్తమ స్నానం మనస్సులోని కల్మషాన్ని లేకుండా చేస్తుంది"

యక్షుడు ధర్మరాజు ఇచ్చిన జవాబులకు సంతోషించాడు. "నీ తమ్ముళ్ళల్లో ఒకర్ని బ్రతికిస్తాను ఎవరు కావాలో కోరుకో" అన్నాడు నకులుణ్ని బ్రతికించమన్నాడు ధర్మరాజు.

మహాబలపరాక్రమవంతులైన భీమార్జునులను విడిచి, నకులుణ్ని, ఎందుకు కోరావు? – అని ప్రశ్నించాడు యక్షుడు "నేను, భీమార్జునులు కుంతీ కుమారులం. నకుల సహదేవులు మాద్రి బిడ్డలు. కుంతీ కుమారుల్లో నేను బ్రతికి ఉన్నాను కనుక మాద్రి సంతతి కొనసాగటానికి ఆమె పుత్రుల్లో పెద్దవాడిని కోరాను"– అన్నాడు ధర్మరాజు. పక్షపాతంలేని ధర్మరాజు గుణానికి సంతోషించాడు యక్షుడు నిజరూపంలో యమధర్మ రాజుగా ప్రత్యక్షమై భీమార్జున నకుల సహదేవుల నందర్నీ బ్రతికించాడు. మరో వరం కోరుకోమన్నాడు ధర్మరాజుని 'బ్రాహ్మణుని యొక్క నిప్పు పుట్టించే కొయ్యకర్రను మృగము ఎత్తుకొనిపోయింది, దాన్ని యిప్పించు'– అన్నాడు ధర్మరాజా! 'నీ ధర్మదీక్షను తెలుసుకోటానికి నేను చేసిన పరీక్ష ఇది. మృగమూ లేదూ, నిప్పుకర్రా లేదు'– అని యమధర్మరాజు చెప్పి, రాబోవు అజ్ఞాతవాసంలో పాండవులు కోరుకునే రూపాలు వారికి వచ్చేటట్లు వరమిచ్చి అంతర్ధానమైనాడు

దాహం అవుతున్నప్పటికి, దాన్ని ఆపుకొని, ఓర్పుతో యక్షునికి జవాబులిచ్చిన ధర్మరాజు ఉత్తమ సత్యాలను తెలియజేశాడు తెలివితప్పి పడిపోయిన తన స్వంత తమ్ములను విడిచిపెట్టి, తన సవతితల్లి కుమారులలో పెద్దవాణ్ణి బ్రతికించుటకు వరం కోరుట అతని గొప్పతనానికి తార్కాణం. ◯

# ఆర్ష విజ్ఞానాన్ని ఆపోసన పట్టిన అగస్త్యుడు

# శ్రీ వేలూరి శివరామశాస్త్రి

-కంచి వాసుదేవరావు

బ్రహ్మశ్రీ శతావధాని వేలూరి శివరామశాస్త్రిగారు కవులలో ఋషితుల్యుడు, అంతర్ముఖుడు. వేలూరి వారి రచనలపై పరిశోధన జరిపి డాక్టరేటు బిరుదు పొందిన మహతీశంకర్‌గారి మాటలలో చెప్పాలంటే– "శ్రీ శివరామశాస్త్రిగారు శతావధాని. మహాపండితులు, కవిశేఖరులు 'తత్త్వవేత్త', 'జ్ఞాన తపస్వి' ఆయనకు తెలియని శాస్త్రం లేదు, ఆయన ఎరుగని భాషలేదు ఆయన విజ్ఞానం అపారమైనది– ఆయన ప్రజ్ఞ బహుముఖీనమైనది. వివిధ భాషలలోని విభిన్న శాస్త్ర విషయాలు తెలుగు సోదరులకు అందించాలని ఆయన తపస్సు. అమూల్యమైన ప్రాచీన విజ్ఞానాన్ని ఆధునిక శాస్త్రీయ పరిజ్ఞానంతో సమన్వయపరచి ప్రాచీన నవీన విజ్ఞాన సాగరాల మధ్య వారధి గట్టిన మహా మేధావి శివరామశాస్త్రిగారు.

తన గురించి తన తాతముత్తాతల గురించి శివరామశాస్త్రిగారు ఇలా చెప్పుకున్నారు

"పారమైశ్వర్యంబు పౌరజూచిన మహో
దాత్తుండు నాదు ముత్తాతగారు
జన్నంబు చేయుపై జందెంబు తీసిన
తదాజ్ఞ శేఖరుడు మా తాతగారు
వేద వేదాంగాదివేత్త చమత్కార
తరవాగ్విహర్త మా తండ్రిగారు
కవితచే నాంధ్ర లోకమునందు రసమును
గురిపించువారు మా గురువుగారు
సరవిగానిద్ది యుభయ వంశ ప్రసిద్ధి
నేను పండిత పుత్రుండ నిక్కమిద్ది
నొక్కి చూచిన నాకెల్ల డొక్క శుద్ధి
నామమా, పెద్దదే శివరామశాస్త్రి"

శివరామశాస్త్రిగారిపై తిరుపతి వెంకట కవుల ప్రభావం వుంది. ఆయన శిష్యరికంలో రాటుదేలి శతాధిక శతావధానాలు చేశారు. ఆయన సాహిత్య జీవితం మూడు దశలుగా సాగింది. తొలిదశలో 1920 తిరుపతి వెంకట కవుల అడుగుజాడలలో అనేక శతావధానాలు చేశారు ఆ తర్వాత మరో ఇరవయి సంవత్సరాలు ఆయన కథానికల రచన, నవలా రచన, అనువాదాలు వ్యాసరచనలపై దృష్టి కేంద్రీకరించారు. తెలుగు లెంక తుమ్మల సీతారామమూర్తిగారు గాంధీజీ ఆత్మకథను పద్యకావ్యంగా మలిస్తే శివరామశాస్త్రిగారు సరళమైన వ్యవహారిక భాషలో వచన కావ్యంగా తీర్చి దిద్దారు. కొన్ని శరత్ నవలలను అనువదించారు. "అలంకారశాస్త్ర గ్రంథాలయినా కాదంబరి వంటి సంస్కృత కావ్యాలయినా టిఎస్ ఇలియట్ వంటి ఇంగ్లీషు గ్రంథాలయినా, అతుజరారులాఖులనయినా రవీంద్రుని గీతాంజలి నయినా, శరత్ నవలలనయినా సమానంగా చూడగల విశాల హృదయులూ విద్వన్ముఖులు శివరామశాస్త్రిగారు" అని మహతీశంకర్‌గారు అంటారు. ఆయన రాసిన ఏకావళి, కల్హారమాల, రత్నగర్భ, ఓబయ్య కథ వంటి విలక్షణ రచనలతో పాటు కొన్ని సంస్కృత కావ్యాలు రచించారు

1945–49 సంవత్సరాల మధ్య ఆయన వేదవేదాంగ విజ్ఞాన సాగరాన్ని మథించి అమృతతుల్యమైన అజామరమైన అనేక రహస్యాలను వ్యాసరూపంలో అందించారు. ఆర్ష విజ్ఞానాన్ని ఆపోసన పట్టిన అపర భగీరథుడు శివరామశాస్త్రిగారు. ఆర్ష విజ్ఞానానికి సంబంధించిన అనేకాంశాలను ఆయన శాస్త్రీయ దృక్పథంలో పరిశీలించి ఆధునిక వైజ్ఞానిక శాస్త్రంతో సమన్వయపరిచారు. ఆయన అనేక సారస్వత వ్యాసాలు రచించారు. పీఠికలు పరిచయాలలోనే అవి ఆయన విషయ పరిజ్ఞానానికి అద్దం పట్టాయి. వేదాంత వ్యాసాలు రాశారు. ఆయన ఆర్ష విజ్ఞానాన్ని ఏవిధంగా మథించారో అదే విధంగా ప్రపంచ కమ్యూనిస్టు ఉద్యమ పితామహుడు కమ్యూనిస్టు సిద్ధాంతవక్త అయిన మార్క్సును సంపూర్ణంగా అధ్యయనం చేశారు. మార్క్సిజానికి సంబంధించి ఉద్గ్రంథాల సారాన్ని జీర్ణం చేసుకొని మార్క్స మతం, మార్క్స్ చెప్పిన చరిత్ర అర్థశాస్త్రం మార్క్స్ అనే వ్యాసాలు రచించారు.

శాస్త్రిగారి పైన అరవిందయోగి ప్రభావం అమితంగా వుంది. అరవిందుని సిద్ధాంతాల మథనంలో ఆయన అరవిందుని గురించి అనేక వ్యాసాలు రాశారు. అరవిందులు ఆంగ్లంలో రచించిన సూపర్ మైండును శాస్త్రిగారు "పురుషోత్తమ తత్త్వం" అన్న పేరుతో అనువదించారు. చివరి రోజులలో శంకరాద్వైతం వైపు దృష్టి మళ్ళించారు. పుట్టపర్తి సాయిబాబాను అవతార పురుషులుగా భావించారు.

శాస్త్రిగారు గుడివాడ సమీపంలోని చిరువాడలో ఒక కుటీరం నిర్మించుకొని జీవించేవారు. అంతర్ముఖులు ప్రతిరోజు కొన్ని గంటలు యోగసాధనలో కాలం గడిపిన ముముక్షువాయన. ఆయన కుటీరానికి జరిగిన అగ్నిప్రమాదంలో అమూల్యమైన కొన్ని గ్రంథాలు నాశనమయ్యాయి. మరికొన్ని గ్రంథాలు చోరగ్రస్తమయ్యాయి.

"శివరామశాస్త్రిగారు ప్యూర్ ఇంటలెక్చువల్. అందువలన వారి మనస్సు ఏ ఒక్క విషయంమీద లగ్నమై వుండేది కాదు. వ్యాకరణం, సైన్సు, కవిత్వం అవధానాలు, యోగం ఇల్లా దేనిమీద పడితే దానిమీదకు ఆయన మనసు వెళ్ళుతూ వుండేది. ఆయనకు ఏ ఒక్క దానిలో సంతృప్తి వుండేది కాదు. శాస్త్రిగారు మహా వ్యక్తి. చాలా గొప్పవాడు. హి ఈజ్ యాన్ ఇంటలెక్చువల్ జయంట్" అని రాయప్రోలు సుబ్బారావుగారు అసాధారణమైన పద్ధతిలో ప్రశంసించారు.

ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ మహతీశంకర్ గారి సంపాదకత్వంలో శివరామశాస్త్రిగారి వ్యాసాలను చక్కని వర్గీకరణలో ఒక బృహత్ గ్రంథంగా ప్రచురించింది. దాన్ని చదివే అవకాశం ఇటీవలే నాకు కలిగింది. అది చదివినవారికెవరికైనా ఆయన బహుముఖ ప్రజ్ఞ అర్థం అవుతుంది. నిజంగా రాయప్రోలు వారన్నట్లు ఆయన ఇంటలెక్చువల్ జయంట్. ○

# గీత - అమృతవర్షిణి

సాయి గంగామహాదేవ్

తపస్విభ్యోఽధికో యోగీ జ్ఞానిభ్యోఽపి మతోఽధికః ।
కర్మిభ్యశ్చాధికో యోగీ తస్మాత్ యోగీ భవార్జున ॥

—భగవద్గీత యందలి ప్రతి అధ్యాయమూ 'యోగ' శబ్దంతో కీర్తింపబడుతున్నది. ఐతే యోగమనగా ఏమిటి? "యుజ్యత్ యోగః – యుజిర్ యోగే" అనగా "కూర్చబడునది" అని అర్థము. యోగమనగా కలయిక అని అర్థము. అర్జునులవారి విషాదము ఆత్మజ్ఞానప్రాప్తికి దారితీయుట వలన ఆ విషాదమునూడా విషాదయోగమైనది. మరికొందరి తపస్సులు కొన్ని కారణాలచే భ్రష్టమొందటం వలన వారి తపస్సులు తమస్సులుగా పరిణమిస్తు వచ్చినవి. కనుకనే ఏది ఆచరిస్తున్నావనేది కాదు ప్రధానం, ఏ భావంతో ఆచరిస్తున్నావనేదే ప్రధానం. కనుకనే భగవానుడిచ్చట అర్జునుల వారిని యోగివి కమ్మని ప్రబోధించాడు.

దీని అంతరార్థమేమనగా "నీవేది చేసినా చూసినా అది దైవంతో వియోగం కలిగించనిదై, యోగం చేకూర్చునదై యుండాలని. ఈ స్థితి ముందు తక్కినవన్నీ తలక్రిందులే. అందువలననే తపస్వులకంటెను; జ్ఞానులకంటెను; కర్మిష్ఠుల కంటెనూ యోగి గొప్పవాడని భగవానుడిచ్చట ప్రబోధించారు. తపస్సనగా ఏమిటి? గడ్డాలు, మీసాలు పెంచి, కాషాయవస్త్రాలు ధరించి ఉపన్యాసాలివ్వటం, గ్రంథాలు రచించటం కాదు. "తపతీతి తపః" తపింపచేయుటమే తపము. అనగా— కన్నులు T V చూడాలని, సినిమాలు చూడాలని కోరుకుంటాయి. వీటికి ఆ ప్రాకృతిక దృశ్యాలను చూపించక భగవత్ దివ్యరూపాలను చూపించాలి, మహాత్ములను దర్శింపచేయాలి. ఆ సమయంలో కన్నులు తపిస్తాయి. అదే తపస్సు. అట్లే ప్రాకృతిక మార్గాన్ని కోరే ఇంద్రియాలను ఆధ్యాత్మికంలో ప్రవేశపెట్టటమే తపస్సు. ఐతే యిట్టి తపస్సులో ప్రాకృతిక ఇచ్ఛ, పారమార్థిక ఇచ్ఛ రెండూ కలిసివుండడంవలన ఇట్టి తపస్సు గలిగినవారి కంటెనూ, దైవభావంతోనే సమస్తాన్ని ఆచరించువాడు (యోగి) శ్రేష్ఠుడే గదా! అందుకే తపస్వులకన్న యోగి శ్రేష్ఠుడని భగవానుడు ప్రబోధించినాడు.

ఇక ఎవరు జ్ఞాని? "జ్ఞాతీతి జ్ఞః" అనగా ఎరుగువాడు జ్ఞాని. ఇంద్రియముల ద్వారానే దేనినైనా ఎరుగుట సాధ్యమౌతుంది. కనుక జ్ఞాని అనగా ఇంద్రియములమీద ఆధారపడినవాడని అర్థము. కనుక ఇట్టి జ్ఞానికన్ననూ భగవంతునినుండి ఏ విధంగానూ వియోగం ఎరుగని యోగి శ్రేష్ఠుడని భగవానుని ప్రబోధ.

ఇక మూడవవారు కర్మిష్ఠులు. అనగా కర్మనాచరించువారు. కర్మ అనగా ఏమిటి? కరణముయొక్క వృత్తి కర్మ. కరణమనగా ఇంద్రియము. ఇంద్రియముల వృత్తులే కర్మలు. సంకల్పముకూడా కర్మలే. కర్మలనబడే ఇంద్రియ వృత్తులను ఆశ్రయించినవారు ఈశ్వరునికి శరణాగతులని చెప్ప వీలుకాదు. అందువలననే ఇటి కర్మిష్ఠులకంటెనూ దైవమునుండి వియోగమెరుగని యోగి శ్రేష్ఠుడని భగవానుని బోధన.

తపస్సైనప్పటికినీ, జ్ఞానమైనప్ప కర్మ ఐనప్పటికినీ అవి దైవభావంతో కూడనినాడు అనగా యోగస్వరూపాన్ని ధరించనప్పుడు తపస్సు తమస్సౌతుంది. జ్ఞానం అజ్ఞానమౌతుంది; కర్మ ఖర్మౌతుంది. కనుకనే ప్రతి చర్య యోగం కావాలనే, ప్రతి వ్యక్తి యోగి కావాలనే— గీత విషాదాన్ని సైతం యోగంగా తీర్చిదిద్ది అందించింది. దైవం తప్ప అన్యం గమ్యం కాదని గుర్తించి వర్తించుటే యోగం. అట్టి యోగులై వర్ధిల్లెదరు గాక! ఇతిశమ్!

○

# SRI SAI HARI REAL ESTATES

6/506, Besides Arya Vysya Chowltry

**PUTTAPARTHI** – 515 134

ANANTHAPUR Dt. ANDHRA PRADESH

పుట్టపర్తియందు ప్లాట్లు, ఇండ్ల స్థలములు కావలసినవారు, అమ్మదలచినవారు ఈ క్రింద చిరునామా వారిని సంప్రదించండి.

1. సూపర్ స్పెషాలిటీస్ హాస్పిటల్ ఎదురుగా ప్లాట్లు కలవు.
2. గోకులం పోస్టాఫీసు ఎదురుగా ప్లాట్లు కలవు.
3. M.R.O ఆఫీసు ఎదురుగా ప్లాట్లు కలవు.
4. బీడుపల్లికి పోవు బస్సు రోడ్డు వద్ద ప్లాట్లు కలవు.
5. ప్రశాంతి నిలయం దగ్గరలో గల ప్లాట్లు.
6. అపార్టుమెంట్స్ కావలసినవారు కూడా సంప్రదించండి.

ప్రొప్రయిటర్

**పి. సిద్ధయ్యశెట్టి**

ఆర్యవైశ్య సత్రం ప్రక్కన

**పుట్టపర్తి – 515 134**

Phone : 2086

3 వ పేజీ తరువాయి

గాని ఆచరించడంలేదు. ఒక్క భారతీయులుమాత్రమే దీనిని ఆచరణలోపెట్టి, ప్రబోధిస్తున్నారు. భారతీయులు పుట్టను, గుట్టను, చెట్టును, మట్టిని, పిట్టను ఆరాధిస్తున్నారు. ఇది కేవలం మూఢాచారములని ఇతర మతిములవారు అపహాస్యం చేస్తున్నారు ఇది కేవలం మతిలేని స్థితియేగాని సరియైన స్థానం కాదు. చెప్పటం సర్వభూతములయందూ భగవంతుడున్నాడని, దానిని ఆచరించేటటువంటి భారతీయులను అపహాస్యం చేయడం మాత్రం వెర్రితనం. చెప్పినట్లు చేసేటటువంటి వాడు మూర్ఖుడా? దీనిని విజ్ఞులు విచారించాలి. చెప్పినట్లు చేసేటటువంటివారు భారతీయులు చెప్పట ఒకటి చేయటం మరొకటి అనేటటువంటిది ఇతర మతముల వారు. ఏ మతమును మనం విమర్శించకూడదు.

"మతములన్ని చేరి మంచినే బోధించె
తెలిసి మెలగవలెను తెలివి తోడ
మతులు మంచివైన మతమేమి చెడ్డది?
వినుడు భారతీయ వీరసుతుడ!"

మన మతులు చెడకొట్టుకుంటున్నామేగాని, మతములు ఏనాటికినీ చెడిపోవునవి కావు కనుక ఈనాడు మానవునికి బోధించడం ప్రధానం కాదు. మతులకు బోధించాలి. మతులకు బోధించినప్పుడు మాత్రమే మనుష్యులు సక్రమమైన మార్గంలో ప్రవేశిస్తారు. మనిషి కాదు ప్రధానం మనసే. మనసును ఆధారము చేసుకొనే మనిషి జీవిస్తున్నాడు. కనుక పరిశుద్ధమైన మనసును, పవిత్రమైన భావములను ఈనాడు మానవుడు అభివృద్ధి గావించుకోవాలి.

ఈ జగత్తునందు ఉన్నది ఒక్కటే. రెండు అనేటటువంటిదిలేదు

"ఏది కలదని చెప్పుదుమో అది లేదు
ఏది లేదని చెప్పుదుమో అది కలదు
ఉన్న దొక్కటే దైవంబు ఎన్నటికిని
లేనిదయ్యాని భావంబు చూడరయ్యా?"

మన భావములే లేనటువంటివిగా మనం పుట్టించుకుంటున్నాం. ఉన్నది ఒక్కటే హిందువులుగాని, ముస్లిములుగాని, బౌద్ధులుగాని, జైనులుగాని, పార్శీలుగాని — అందరూ దైవత్వాన్ని ఏకత్వంగా భావిస్తూ వచ్చారు మానవుని యందలి సహనం, సానుభూతి ఏకత్వం ఏనాడు మానవుడు దర్శించునో, ఆనాడే సమత్వం, సోదరత్వం, న్యాయం— ఈ ప్రపంచంలో చేకూరుతుంది. ఏకాత్మభావమును అభివృద్ధి గావించుకున్నప్పుడే కలహములు, కల్లోలములు సన్నగిల్లుతాయి. అందరియందును వున్నటువంటి ఆత్మతత్త్వము ఒక్కటేననే సత్యమును గుర్తించి, వర్తించాలి. ఈ ప్రపంచమంతయూ అంగాంగములతో కూడిన స్వరూపమే. మనకు కండ్లు, చెవులు, ముక్కు, నోరు అనేటటువంటి ఇంద్రియములున్నాయి ఈ ఇంద్రియములన్ని దేహమునకు అంగములే దేహము సమాజమునకు అంగము. సమాజము మానవత్వమునకు అంగము. మానవత్వము ప్రకృతికి అంగము. ప్రకృతి పరమాత్మకు అంగము కనుక పరమాత్మకు అంగము ప్రకృతి ప్రకృతియొక్క అంగము మానవత్వం. మానవత్వముయొక్క అంగము సమాజము. సమాజము యొక్క అంగము దేహము. దేహముయొక్క అంగములే ఇంద్రియములు కనుక ఈ ఇంద్రియములకు, ఈ దైవత్వమునకు ఎంత సన్నిహిత సంబంధబాంధవ్యమున్నదో చక్కగా విచారించవచ్చును. కనుక మన యొక్క ఇంద్రియములను సక్రమమైన మార్గములో ప్రవేశపెట్టి, దివ్యత్వమైన దైవత్వాన్ని విశ్వసించి, మన జీవితాన్ని సార్థకం గావించుకోవాలి.

మన దేహమున్నది, లోకమున్నది, అడవులున్నవి, చెట్లు ఉన్నవి, గుట్టలున్నవి. వీటన్నింటియందును కట్టకడపటి పదము ఉన్నది ... ఉన్నది ... ఈ "ఉన్నది" అనేటటువంటి పదమే మానవుని యొక్క ఉనికిని పరిపూర్ణంగా ప్రకటిస్తూ వస్తున్నది. ఉన్నది... ఉన్నది ... ఉన్నది ఒక్కటే. దీనిని మానవుడు సక్ర

మంగా గుర్తించుకొనలేక, స్వార్థం స్వప్రయోజనములకు గురైపోవటంచేత, ఈ పవిత్రమైన దివ్యత్వాన్ని విస్మరిస్తున్నారు ఇది కేవలం అహంకార ఆడంబరముల యొక్క ప్రతిబింబములే. యీ అహంకార ఆడంబరములు ఏనాడు అణగిపోవునో, ఆనాడే మనయందు ఆత్మతత్త్వము ఆవిర్భవిస్తుంది. కనుక మనలో వున్నటువంటి ఈ కల్పితములైన ఈ దుర్గుణములు, మన ఆహార విహారముల వలన సంభవించినవే గాని ఆత్మనుండి ఆవిర్భవించినవి కావు.

కామ క్రోధ లోభ మద మాత్సర్యములనేటటువంటివి, ఈ రాగద్వేషములనేటటువంటివి మనం తినే ఆహారం నుంచి మనం కూడే సంగమము నుంచి, బయట నుంచి ప్రవేశించినటువంటివే గాని లోపల నుంచి ఆవిర్భవించినటువంటివి కావు. ప్రేమ, దయ, సహనము, సానుభూతి మొదలైనవి మనలో నుంచి ఆవిర్భవించినటువంటివి. ఇవియే మానవతా విలువలు మానవతా విలువలను మనం విస్మరించి, కేవలం బాహ్యమైన గుణములనే విశ్వసించి, దీనినే అనుసరించి పశు జీవితాన్ని గడుపుతున్నాము. ఇది సరికాదు. నిజముగా మనం మానవులమనే సత్యాన్ని గుర్తించి వర్తించాలి. ధనము రావచ్చు, పోవచ్చు, బలము ఉండవచ్చు, క్షీణించవచ్చు ఈ జగత్తులో వుండినటువంటి సర్వ సంపదలూ మార్పు జెందవచ్చు. కాని మార్పు చెందనటువంటిది ఒక్కటే. అదే నిశ్చలమైన ప్రేమ ఈ మార్పు చెందేటటువంటి ప్రేమలు నిజమైన ప్రేమలు కావు. మార్పు చెందేటటువంటివి తాత్కాలికమైన లౌకిక ప్రేమలే. దీనిని "ప్రేమ" అని చెప్పటానికి వీలుకాదు. ఇది కేవలం అభిమానమే. యీ దేహాభిమానమును బట్టి, కులాభిమానమును బట్టి, మతాభిమానమును బట్టి, సంబంధాభిమానములను బట్టి, సంభవిస్తుంటాయి. కాని ప్రేమకు ఎట్టి అభిమానమూ లేదు. యీ ప్రేమ కేవలం హృదయమునకు మాత్రమే సంబంధించినటువంటిది. అట్టి నిత్య సత్యమైన ప్రేమ తత్త్వాన్ని యీనాడు మానవుడు ఏనాడూ తలచడంలేదు. అనిత్యమూ, అశాశ్వతమైనటువంటి ప్రేమలనే విశ్వసించి, నిరాశకు గురై, తన జీవితాన్ని అంత్యం గావించుకుంటున్నాడు మానవుడు. నిర్విరామ కృషితో, నిరంతర తాపత్రయముతో, అంతులేని ఆశలతో, అర్థంగాని ఆవేదనతో, అప్రాప్త రూపప్రాప్తికై ప్రాకులాడుచూ, మానవుడు దిక్కు తెలియక పరితపించుచున్నటువంటి యీ మార్గంలోపల, దిక్కులు చూపే, చక్కని దీపికలు ఆధ్యాత్మిక జ్యోతులనేటటువంటి సత్యాన్ని మానవుడు గట్టిగా విశ్వసించాలి.

ఆధ్యాత్మికమనగా కేవలం భౌతికములైన ఆరాధనలు కావు. మానవునియందు ప్రవేశించినటువంటి ఈ పశుత్వాన్ని మనం దూరం గావించుకోవాలి. అప్పుడే మనలో దివ్య భావములు ప్రవేశిస్తాయి. ఈ దివ్యభావముల ఆవిర్భావమే నిజమైనటువంటి ఆధ్యాత్మికము. సర్వులూ భగవంతుని బిడ్డలుగా మనం విశ్వసించాలి. ఎవ్వరినీ మనం ద్వేషించరాదు. కాని ఈనాడు ఈ రాగద్వేషముల చేతనే మానవుడు తన రక్తమును కలుషితం గావించుకుంటున్నాడు. మానవుని యొక్క రక్తము పరిశుద్ధమైనటువంటిది, పవిత్రమైనటువంటిది, దివ్యమైనటువంటిది ఇట్టి మానవ రక్తమును మనం దుర్వినియోగపరచుకోవటం, దుర్మార్గములో ప్రవేశపెట్టటం వలన ఇది రాక్షసత్వంగా, పశుత్వంగా మారుతుంది

ఈనాడు భారతదేశం అనేక విధములైన సమస్యలతో సతమతమైపోతున్నది. సమస్త దేశములూ యీ విధమైన అవస్థలకు గురియైపోతున్నాయి. కారణమేమిటి? ఏకాత్మ భావమును మరచిపోవటమే. ఏకాత్మ భావము నుండియే విశ్వప్రేమ ఆవిర్భవిస్తున్నది. ఆ ప్రేమయే ప్రతి మానవుని కట్టివేసి ఏకత్వంగా నిరూపిస్తున్నది. ఈ ప్రేమ తత్త్వము హృదయము నుండి

ఆవిర్భవించాలి. అప్పుడే నిజమైన ఏకత్వం సంభవిస్తుంది.

ప్రేమస్వరూపులారా!

కేవలం మన జీవితం అనేటటువంటిదాన్ని తిండి తీర్థాల నిమిత్తమై, భోగభాగ్యాల నిమిత్తమై మనం జీవిస్తున్నామని భ్రమిస్తున్నాం. యీ నిమిత్తమై మన జన్మము రాలేదు. "జంతూనాం నరజన్మ దుర్లభం" యీ నరజన్మము యొక్క దుర్లభమేమిటి? పశువులూ తింటున్నాయి, తిరుగుతున్నాయి, ఆనందిస్తున్నాయి. వాటికి భార్యాబిడ్డలు, బంధుత్వం వుంటున్నాయి. యీ సమస్త గుణములూ మానవునియందూ ఉంటున్నాయి అయితే మానవుని యొక్క ప్రత్యేకత ఏమిటి? దయ, ప్రేమ, సహనము, సానుభూతి అనేటటువంటి ప్రధానమైన హృదయం మానవునికి ఉన్నది. కాని తనకున్నటువంటి సమస్త సద్గుణములను మానవుడు మరచిపోతున్నాడు. కేవలం భౌతికమైన స్వార్థమే దీనికి కారణం. స్వార్థమనే అద్దములు పెట్టుకున్నటువంటి వారికి సమస్తమూ స్వార్థంగానే కనిపిస్తుంది. ఎర్ర అద్దాలు పెట్టుకున్న వారికి సర్వమూ ఎర్రగానే కనిపిస్తుంది కనుక దృష్టిదోషమే సృష్టిదోషంగా కనిపిస్తున్నది. సృష్టిలో ఏ దోషమూ లేదు. సర్వమూ మన దృష్టిలోనే ఉంటున్నది. దీనిని పురస్కరించుకొనియే 'యద్భావం తద్భవతి' అన్నారు. కనుక యీ పంచభూతములను సక్రమమైన మార్గములో ప్రవేశింపబెట్టినప్పుడే, నిజమయిన మానవత్వాన్ని మనం సార్థకం గావించుకున్నవారమవుతాం.

యీనాడు Rights కోసం పోరాడుతున్నారు. Rights అంటే దీనికి అర్థం ఏమిటి? నేను పొందవలసినటువంటిది. ఏ విధంగా పొందగలవు? విత్తనం పెట్టకుండా వృక్షమవుతుందా? వృక్షము కాకుండా ఫలము నీకు అందిస్తుందా? కాని విత్తనములు పెట్టటంలేదు, వృక్షములను రక్షించడంలేదు. ఫలం మాత్రంకావాలి... ఎంత మూర్ఖత్వం ఇది? కనుక మనకు Right ను కోరే అధికారం ఎవ్వరికీలేదు. Do your duty, duty is god, work is worship మీమీ కర్తవ్యాన్ని మీరు నిర్వర్తిస్తుంటే, నీకు తగినటువంటి అధికారం నీకు లభ్యమవుతుంది. కనుక ప్రతి మానవుడు తన కర్తవ్యాన్ని నిర్వర్తించాలి కర్తవ్యమే మన

## అభినందనలు

భగవాన్ శ్రీ సత్యసాయి బాబా 68వ జన్మదినోత్సవ సందర్భంగా "శ్రీ సత్యసాయి శతకము" శ్రీవాణికి అనుబంధ సంచికగా వెలువరించిరి. చదివి చాలా ఆనందమును అనుభవించితిమి. అట్లాగే ప్రతి యేటా సాయి సుధా స్రవంతిని ధారాపాతంగా అందించగలరని ఆశిస్తూ మీ అఖండ సాయిసేవకు అభివందనములు అందజేస్తూ ....

కృష్ణమోహను శ్రీవాణి
కొలువులోన
సార్వభౌమాది కారి శ్రీ
సత్యసాయి
అవతరించంగ శ్రీవాణి
కందము మరె
అందు సత్యత్వమున్న
జ్ఞానియగును.

కర్రి కృష్ణమ్మ H.M.

రోగము. కర్తవ్యమే మన భోగము, కర్తవ్యమే మన త్యాగము - సర్వమునకూ కర్తవ్యమే మూలము. కనుక ఎవరి కర్తవ్యాన్ని వారు నిర్వర్తిస్తుంటే జగత్తులో సుఖశాంతులకు ఏమాత్రం లోటు ఉండదు. అయితే యీనాడు ఎవరి స్థానాన్ని వారు పోషించుకోవటంలేదు, ఎవరి కర్తవ్యాన్ని వారు చక్కగా నిర్వర్తించడంలేదు తన వంతు కర్తవ్యాన్ని తాను మరచి పరులదానికోసం పట్టుబడుతన్నాడు

నా తల్లి మాత్రమే నాకు గొప్ప, పూజనీయురాలు మిగతా తల్లులంతా పనికిమాలిన వారని ఏ మానవుడైనా చెప్పగలడా ? ఆ విధంగా చెప్పేటటువంటివాడు మానవుడా ? కాదు ... కాదు ... నీ తల్లి నీకు ఎంత ప్రీతియో, ఎంత గౌరవమో, ఎదుటివాని తల్లి కూడా అంత ప్రీతి, అంత గౌరవము. అదే విధముగా ఈనాడు నా మతము గొప్పది, నీ మతము చిన్నది అనే అభిప్రాయాలు వెలిబుచ్చుచున్నారు. ఎవరికినీ యీ విధముగా చెప్పడానికి అధికారమే లేదు. నీ మతము నీకు ఎంత గొప్పదో, ఎదుటి వానికి అతని మతము కూడా అంత గొప్పది. నీ తల్లి నీకు ఎంత పూజనీయురాలో, ఎదుటి వానికి అతని తల్లి అంత పూజనీయురాలు నీ తల్లిని నీవు పూజించు, గౌరవించు. కాని పరుల తల్లులను మాత్రం దూషించరాదు, అవమానపరచరాదు. అదే విధముగా నీ మత ధర్మాలను నీవు నిర్వర్తించుకో. పర మతములను మాత్రం దూషించరాదు, విమర్శించరాదు. ఈ విధమయిన సత్యమును గుర్తించుకోలేని మతిహీనులైపోతున్నారు మానవులు అందరూ ఈ సత్యమును చక్కగా గుర్తించుకుంటే, లోకములో ఎట్టి కల్లోలములకు, కలహములకు అవకాశమే వుండదు.

ఈనాడు లోకములో ప్రబోధ ప్రచారములు సలిపే వారు కోకొల్లలు. కాని ఆచరించి నిరూపించి ఆచరణ రూపమైన ప్రచార ప్రబోధలు సలిపేవారు నూటికి ఒక్కరైనా, కోటికొక్కరైనా కనిపించడంలేదు చెప్పే టటువంటివాడు ఏ విధమైన పనులు చేస్తున్నాడని వేయికళ్ళతో చూస్తుంటారు, చెప్పినది ఆచరణలో చూపనప్పుడు వానికి గౌరవమూ లేదు, వాని మాటలకు విలువకూడా ఉండదు. ఏదో గౌరవిస్తున్నామని అల్పానందమును అనుభవిస్తున్నామేగాని వేరుకాదు. ఏ పనినైనా ఆత్మతృప్తితో చేయటం నేర్చుకోవాలి. "సత్యం నాస్తి పరో ధర్మః" సత్యమునకు మించిన ధర్మం వేరొకటి లేదు దేనికిని మనం భయపడనవసరంలేదు. అసత్యపరునికే భయం. సత్యంగా ప్రవర్తించేవానిప్రక్కన భయం దగ్గరకూడా చేరదు. ధైర్యంతో, సాహసంతో ముందంజ వేసి సమాజసేవలలో మనం పాల్గొనాలి. సర్వులను మన సోదరులుగా విశ్వసించాలి. మతభేదములను, ద్వేషము

## తెలిసికొనుము తెలుగుబిడ్డ

వేదపఠన లేని వేమన కవిరాజు
వేదసూక్తులెన్నొ విశదపరచె
అతిశయోక్తిగాదు అభిరాముడే సాక్షి!
తెలిసి నడచుకొనుము తెలుగుబిడ్డ!

భవహరంబు తాను పలికిన పలుకని
భాగవతమునందు పలికినాడు
పుణ్యపురుషుండు పోతనామాత్యుండు
తెలిసి నడచుకొనుము తెలుగుబిడ్డ!

పాలతీపి పెంచజాలును కలకండ
ఉన్న రుచిని పెంచు ఉప్పు చేరి
మనసు గలిసినపుడె మైత్రికి అందంబు
తెలిసి నడచుకొనుము తెలుగుబిడ్డ!

— ఏకా రామచంద్రరావు

నును చంపుకోండి మతాన్ని ప్రేమించాలిగాని, ద్వేషించరాదు

ఈనాడు దేశరక్షణ కావాలి ... కావాలి ... అంటున్నారు దేశరక్షణకు నీవు పాటుపడనవసరంలేదు దేశరక్షణ నీ చేతిలో లేదు సత్యాన్ని ధర్మాన్ని రక్షించు ఆ రెండే దేశాన్ని రక్షిస్తాయి ఏ వస్తువునైనా ఉపయోగించుకొనే వ్యక్తియందున్నదిగాని, పదార్ధమునందు లేదు కత్తితో ఫలములు కోయవచ్చు, భుజించవచ్చు అదే కత్తితో గొంతులు కూడా కోయవచ్చు. ఇది కత్తిదా దోషం? లేదు... లేదు ... కత్తి పుచ్చుకున్న వ్యక్తిది దోషము. కనుక జగత్తులో దోషమైనటువంటిది ఒక్కటి కూడా లేదు. అన్నీ మంచివే. కాని వాటిని ఉపయోగించేవారు విచక్షణా జ్ఞానమును కోల్పోయి మూర్ఖులైపోతున్నారు. ఈ మూర్ఖత్వానికి మూలకారణము స్వార్ధమూ స్వప్రయోజనములే. స్వార్ధముండాలి. దానికి పరిమితి ఉండాలి "న శ్రేయో నియమం వినా" ఒక నియమం ఉంటుండాలి. నియమములు దాటిపోతే అది రోగములుగా మారుతాయి విచక్షణా జ్ఞానం వుండాలి. అదే మానవునికి Gift. కోపం వచ్చినవెంటనే తక్షణమే క్రియలో ప్రవేశించవద్దు ఇది మంచా? చెడ్డా? ఇది చేయదగినదా? కాదా? నేను మనిషినా? లేక పశువునా? అని తనకు తాను విచారణ చేసుకుంటే కోపం తగ్గిపోయి, ఆ దుర్మార్గములో నీవు ప్రవేశించవు దుర్మార్గమైన భావాలు మనలో వచ్చినప్పుడు "నేను మనిషిని, పశువును కాదు" అనే పదమును పదిసార్లు ఉచ్చరించుతే ఆ ఉద్వేగము తగ్గిపోతుంది ఇది లేకపోతే మానవునిలో విచారణాశక్తి వుండి ప్రయోజనం ఏమిటి? ఉన్నదానిని ఉపయోగించుకోలేకపోయినప్పుడు, ఇక లేనిది కోరటంవలన వాటిని ఏవిధంగా ఉపయోగపెట్టుకోగలవు?

దివ్యాత్మస్వరూపులారా!

ప్రతి ఒక్కరూ ఆత్మస్వరూపులే, దైవస్వరూపులే. వేల బల్బులు వెలుగవచ్చు. కొన్ని బల్బులు ఎర్రగా, మరికొన్ని నీలంగా వుండవచ్చు, రంగులు వేరువేరుగా వుండవచ్చు, వాటి ఓల్టేజి వేరువేరుగా వుండవచ్చు, కాని కరెంటు ఒక్కటే. అందరియందు వుండినటువంటి దైవత్వమనేటటువంటి దివ్యశక్తి ఒక్కటే. నేను గొప్ప మీరు చిన్న అనే భావం ఏమాత్రం ఉండరాదు. మీరు కూడా గొప్ప కావాలంటే మీ Capacity ని అభివృద్ధిపరచుకోండి. బల్బులు మార్చవచ్చునుగాని కరెంటును మార్చలేము హృదయమును విశాలం చేసుకోవాలి మనసులను ప్రకాశింపజేసుకోవాలి. అప్పుడే సరియైనటువంటి ఆనందాన్ని అనుభవించగలం. సంకుచితమైన హృదయాన్ని పెట్టుకొని విశాలమైన మాటలు ఉచ్చరించుతే ఏమాత్రం విలువ యివ్వరు.

మొదటిది "Be", నీవు ఉండు రెండవది "Do". నీవు చేయి. మూడవది "Tell", నీవు చెప్పు. ఇదే నిజమైన ఆదర్శము. కనుక ఎవరియందు చెడ్డభావములు ప్రవేశించరాదు. ఏ చెడ్డభావము వానిలో ప్రవేశిస్తుందో అది వానినే శిక్షిస్తుంది దీనినే చెప్పారు.

"తనకోపమే తన శత్రువు
తన శాంతమె తనకు రక్ష
దయచుట్టంబౌ తన సంతోషమె
స్వర్గము తన దుఃఖమె నరకము"

కనుక మన భావాలను పవిత్రమైనవిగా చేసుకోవాలి ఈ శరీరాలకు పుట్టిన పండుగలు చేసుకుంటున్నాం! ఇవి కాదు మనకు పుట్టిన పండుగలు. ఏనాడు ఎవని హృదయములో పవిత్రమైన భావములు ఆవిర్భవిస్తాయో అదియే వాని నిజమయిన పుట్టిన పండుగ. పుట్టిన పండుగలు చేసుకుంటున్నామే గాని చెప్పిన మాటలు అనుసరిస్తున్నామా? ఆచరిస్తున్నామా? చెప్పిన మాటలు ఆచరించినప్పుడే ఈ పుట్టిన పండుగ యొక్క ఫలితాన్ని అనుభవించినవారమవుతాం.

మన ప్రేమను పదిమందికీ పంచడంలేదు. ఇచ్చుకోవటంలో మనం "జీరో" పుచ్చుకోవటంలో మనం "హీరో" మనం పుచ్చుకోవటానికి సిద్ధంగా వుంటున్నామే గాని, ఇచ్చుకోవటానికి సిద్ధంగా లేం. కాని కొన్నింటిని మాత్రం ఇచ్చుకోవటానికి సిద్ధంగా ఉంటారు. ఏమిటది? తనకు ఇష్టం లేనివి ఇచ్చుకోవటానికి ప్రయత్నిస్తాడు. కాశీకో, గయకో వెళ్ళుతుంటారు. తనకిష్టమయిన దానిని త్యాగం చేయమని బోధిస్తుంటారు. కాని అక్కడికి వెళ్ళి ఇష్టం లేని ఏ కాకరకాయనో విడిచిపెడుతుంటారు. అదా! చేయవలసిన త్యాగము? ఏది నీకు ప్రీతికరమయినదో అట్టి దానిని ఇతరులకు అందించాలి. కాని యీనాటి మానవుడు ఇతరులనుంచి గౌరవాన్ని అందుకోవటానికి సిద్ధంగా వున్నాడు గాని, ఇతరులను గౌరవించడంలేదు. ఇతరులు ఏది చేస్తే నీవు తప్పని భావిస్తావో, ఆ తప్పును నీవు చేయకుండా చూచుకో.

"పరోపకారః పుణ్యాయ పాపాయ పరపీడనమ్" ఇదే అష్టాదశ పురాణముల సారాంశం Help ever, Hurt never. ఈ రెండూ వుంటే చాలు. కాని జగత్తులో ఐకమత్యం ఏమాత్రం కుదరటం లేదు. ఎట్లా కుదురుతుంది? బుద్ధులు వేరువేరుగా ఉన్నాయి. "ముండే ముండే మతిర్భిన్నః" తలలు వేరువేరుగా ఉన్నాయి. తలలు వేరైనా తలంపులు ఒక్కటి కావాలి. అదియే నిజమైనటువంటి మానవతా విలువ. ఆ విలువ లేకుండా తలలు మాత్రం పెంచుకుంటూపోతే అది Quantity అవుతుందేగాని Quality కాదు. క్వాంటిటీ వుండి ప్రయోజనం ఏమిటి? భగవంతుడు కోరేది క్వాలిటీ. 'కడివెడు గాడిద పాలు కంటే, గరిటెడు గోవుపాలు మేలు' అనే విషయం విస్మరించరాదు. కేవలం క్వాంటిటీని చూడకూడదు. ఎంతమంది వచ్చారు? ఎంతమంది విన్నారు? అది కాదు ముఖ్యము. ఎంతమంది నడుచుకుంటున్నారు? అది ముఖ్యం.

## శ్రీ సద్గురు సత్సాయి....

సర్వధర్మంబుల సారమొక్కటనుచు
సమత బోధించిన సద్గురుండు
సర్వమతంబుల స్వామి యొక్కడనుచు
మహికి దెల్పినట్టి మార్గదర్శి
సంసారమను ఘనసాగరంబున కొక్క
తీరము జూపించు దీనబంధు
ఈతిబాధల నెల్ల చేతితో తొలగించు
వేదవేద్యుడైన వైద్యుడతడు

సాయి పాహియన్న శరణొసగెడివాడు
కామితార్థ దాన కాంతిమయుడు
అవని జనులనెల్ల యాదరంబున గాచు
దేవదేవుడొకడె దిక్కు మాకు.

- హరి వెంకట లక్ష్మీ ప్రసాద్ బాబు

---

ఒక్కొక్క వ్యక్తి ఇద్దరిని సరిచేస్తే చాలు లోకం బాగుపడుతుంది

ప్రేమస్వరూపులారా!

ఈనాడు మీరు చేయవలసింది ఒక్కటే. నాకు యివ్వవలసిందీ ఒక్కటే. అన్ని దేశముల మానవులూ సుఖశాంతులు అనుభవించాలని కోరండి. 'లోకాస్సమస్తా స్సుఖినో భవంతు' అన్ని లోకములూ బాగుండాలి. అప్పుడే నిజమైన ఏకత్వం ప్రాప్తిస్తుంది. నా దేశం బాగుంటే చాలు. ఏ దేశం ఏమైతేనేమి? అనే దుర్భావనలు మనలో రాకూడదు. అందరూ మన సోదరులే. పాకిస్తాన్ వారు మన సోదరులే. అమెరికా వారు మన సోదరులే. ఈ సద్భావన మనలో వుండాలి.

# గురువు

చదువు నేర్పే గురులకిదె మా వందనం
జ్ఞానదాతల చరణ ధూళికి వందనం !
శాంతమూర్తులు - స్వచ్ఛకీర్తులు
సుజన చంద్రులు - సుగుణసాంద్రులు
గురులు - సురతరులు ॥చదువు॥

రామునకు విలువిద్య నేర్పెను
మౌని విశ్వామిత్రుడు !
కృష్ణునే చదివించె
సాందీప జ్ఞాని పవిత్రుడు !
ఎంత ఘనులకునైనగానీ
గురువులే ప్రత్యక్ష దేవులు ॥చదువు॥

రాధాకృష్ణులు - రామకృష్ణులు
విశ్వకవులు - వివేకానందులు
శంకరులు - వేదవ్యాసులు
ఎందరెందరో జగద్గురువులు ॥చదువు॥

కోటి సూర్యులున్నా - కోటి చంద్రులున్నా
గురుని మాట లేకుండా - ఎద చీకటిపోతుందా?
జ్ఞానజ్యోతి వెలిగించి-మము ప్రగతికి నడిపించే
గురువే బ్రహ్మ ! గురువే విష్ణువు !
గురువే మహేశ్వరుడు !
ఆ త్రిమూర్తి రూపునకిదె వందనం !
ఆ దయాంతరంగున కిదె వందనం ! !

– డాక్టర్ ఆచార్య తిరుమల

---

అయితే ఈనాడు సోదరులు సోదరులకే గిట్టటం లేదు. ఇంక పరదేశీయులను ఏ విధంగా ప్రేమించగలం ? ఇది కాదు. అందరం భగవంతుని బిడ్డలమనే సత్యాన్ని గుర్తించాలి. ఇంత విశాలమైన ప్రేమను పంచుకోవాలి నిజంగా మీరు నమ్మినా నమ్మకపోయినా, నాలో అలాంటి విశాలమైన హృదయం వుండటం వలననే ఇంతమందిని ఆకర్షించగలుగుతున్నాను. ప్రతివారు మూడింటిని సంరక్షించుకుంటే, స్వామి స్వరూపాన్ని ధరించగలుగుతారు. సర్వాలయంమూ భగవంతుడు ఆవిర్భవిస్తాడు. అవే మూడు P (p p p) లు. Purity పవిత్రత, Patience (ఓర్పు), Perseverance (పట్టుదల) – ఈ మూడు గుణాలు నాలో ఉన్నాయి. ఈ మూడూ వున్నటువంటివాడు ఎక్కడికి పోయినా భయముండదు. అన్నిటికంటే ప్రధానమైనది Purity (పవిత్రత) ఈనాడు సర్వమూ మలినమైపోయినది పంచభూతములూ మాలిన్యం కావటమే గాక మానవుని యొక్క మనసు కూడా మాలిన్యమైపోయింది మనిషి మాలిన్యమైనప్పుడు పవిత్రతను ఏ విధంగా సాధించగలడు ? కనుకనే భగవత్ చింతన చేయాలి. మనం ఎవరికీ భయపడకుండా సర్వమునకూ ఆధారమైన భగవంతుని మనం విశ్వసించాలి. అన్నింటినీ రక్షించేది భగవంతుడే శిక్షించేది భగవంతుడు కాదు. నీ కర్మలే నిన్ను శిక్షిస్తున్నాయి. భగవంతుడు రక్షకుడే గాని శిక్షకుడు కాదు. కనుక అట్టి భగవంతుని చింతిస్తూ, భజిస్తూ, సత్కర్మలనాచరిస్తూ, జన సేవలో పాల్గొనాలి. ప్రేమ మనసును పెంచుకోవాలి. ప్రేమ ఉన్నచోట దుర్గుణాలు చేరవు.

ఒక చిన్న ఉదాహరణ. మన ఇంటిలో ఒక సేవకుడున్నాడు. అతను మన ఇంటిలోని చిన్న స్టెయిన్‌లెస్ స్టీలు స్పూన్‌ను అపహరిస్తే, వానిని పోలీసులకు అప్పగిస్తాం కారణమేమిటి? వాడు పరాయివాడు. మనవాడు కాదు. నీ కుమారుడు నీ ఇంటిలోని సొమ్మునే కాజేస్తుంటే మందలిస్తావుగాని, పోలీసులకు అప్పగించుతున్నామా ? కారణమేమిటి ? కుమారుడు తనవాడు, సేవకుడు పరాయివాడు. అందరూ నావారే అనుకుంటే మనలో క్షమాగుణం అభివృద్ధి అవుతుంది, తన, పర అనే భావములు వుండినప్పుడే, ఈ విధమైన భేదములు ఉత్పన్నమవుతుంటాయి. కనుక ప్రేమ తత్వాన్ని పెంచుకుంటే భేదములకు ఏమాత్రం అవకాశం ఉండదు.

( ది 23-11-98 న హిల్ వ్యూ స్టేడియంలో భగవాన్ బాబావారు చేసిన దివ్య ప్రసంగము నుండి)

శ్రీవాణి.

# శుభం భవతు

డా॥ రాపర్ల జనార్దనరావు

ఈ రెండు పదములుగల ఒక చిన్న వాక్యమే ఆర్యసంస్కృతికి, భారతీయ ప్రాచీన భావోన్నతికి గీటురాయి అని చెప్పవచ్చును 'నీకు శుభములు కలుగు గాక' అను ఆశీర్వచనమెంతో ఉదాత్తమైన భావము కలిగినది. 'శుభము' అనిన పదములో ఎన్నెన్నో అంశములు కూడియున్నవి మంగళకరమైన ఈ భావనలో ధన, ధాన్య, వస్త్ర, వాహన, కనక సంపత్తి ఇమిడియున్నది. కేవలము భౌతిక సంపదయేగాక శుభకరమైన ఆముష్మిక సౌఖ్యములుకూడ ఇమిడియున్నవి.

లక్ష్మీపరమైన ధన ధాన్య సంపద కలిగి వ్యక్తి ఈతిబాధలు లేక నీతి నిజాయితి, ఆత్మగౌరవములతో, జీవించుట శుభకరము అయుర్దాయము, ఆరోగ్యము కలిగి అజేయుడై, ఆనందముతో ఒరులకు మోదము కలిగించుచు జీవించుట నిజముగ శుభప్రదము సౌహార్ద్రతతో సఖ్యముగ జీవించు కుటుంబము కలిగి పుత్రపౌత్రాభివృద్ధి తోడ, కీర్తిప్రతిష్ఠలు కలిగిన వంశజులను బడసి జీవించుట అత్యుత్కృష్టమైన శుభలక్షణము ప్రేమ, దయ, దానము, ఆర్తులకు సేవచేసెడి శుభలక్షణములు కలిగియుండుట. పూర్ణమానవున కుండెడు శుభ్ర భావనలు అటులనే త్యాగనిరతి కలిగి పరహితార్థమై జీవించెడి లక్షణము కలుగుట మహనీయ గుణము అపకీర్తిని రానీయక నిజమగు సంఘజీవిగ తోటి మానవులకు సహాయపడుట జీవితమునకు శుభప్రదమైనది వినయము, విధేయత, భక్తిప్రపత్తులు కలిగి మనుగడ సాగించుట భవ్యమగు లక్షణము భక్తి భావనలతో బ్రతుకుట, అట్టి సంతానము బడయుట సర్వోత్కృష్టమైన శుభకరమైన లక్షణము. ఒక వంశమున భక్తిపరుడు జన్మించినచో "మోదంతి పితరోః నృత్యంతి దేవతాః" (నారదభక్తిసూత్రము) ఆ వంశమునందలి పితరులు ఆనందించెరట, అట్టి పరమ భక్తుడు జనించినాడని దేవతలు నృత్యము చేయుదురట, భూమాత ఎంతయో పరవశమగునట. నిజమైన శుభమనిన ఇయ్యదియే. సంగీత సాహిత్యము లందు నిష్ణాతులైన బిడ్డలను పొందుట శుభప్రదము. ఓర్పు, నేర్పు, కౌశలమగు కర్మలచేత ధన ధాన్య సంపదలను బడసి సుఖజీవనమున మెరయుట శుభప్రదము

భగవంతుని వీక్షణము శుభప్రదము విష్ణుసహస్రనామమున శ్రీ మహావిష్ణువును 'తుష్టః పుష్టః శుభేక్షణః' అని ప్రస్తుతింపబడినది. దేవాలయ శిఖరములు, ఆలయ ఘంటారావములు, పూజ చేయబడిన గోవు, తులసికోట, అశ్వత్థవృక్షము (రావిచెట్టు), ఉసిరిచెట్టు, వేపచెట్టు (నింబ) నారికేళము, తటాకమందలి తామర పుష్పములు, వేదశ్రవణము, నూత్నవధువు నుదుటన గల తిలకము, వంశాంకురమును భర్తకు తొలిసారిగ అందచేసెడు నూత్న ప్రసవ వనితావదనము సజీవ నదులయందు చేసెడి గంగాస్నానము, హిమగిరి దృశ్య ఆనందము, సాయంసంధ్యల సూర్యవర్ణ విశేష దర్శనము, సప్త మహర్షుల గగన దృశ్యము, పంచామృతపానము, మహాత్ముల పాదసేవన— ఇవన్నియు శుభప్రదములే.

'శుభం భవతు' శుభములు బడయుదువుగాక అనెడి శుభాశీస్సు ఎంతయో మేలైనది. ○

# ఓ వివేకానందా!, 'మరలా రా స్వామీ'

——————జానమద్ది హనుమచ్ఛాస్త్రి

స్వామీ, మీరు స్వర్గంలో హాయిగా విహరిస్తున్నారా? నేటి భారతదేశ స్థితిగతులను గమనిస్తూ, మీరు అక్కడ ఎలా వుంటున్నారు? మేము భారతీయులం. మేమే నిర్మించిన నరక కూపంలో అలమటిస్తున్నాం. మాపట్ల మీకు కనికరం లేదా?

"లక్షలాదిమంది అజ్ఞానంతో ఆకలితో అలమటిస్తున్నప్పుడు, వారిని మోసగించి వారి వ్యయంతో విద్యాభ్యాసం సాగించి, వారినే నిర్లక్ష్యంగా చూచేవారిని నేను ద్రోహులుగా పరిగణిస్తాను" అంటూ మీరు సింహగర్జన చేసారు.

మీ మాటలు మాకెంతో స్ఫూర్తినిచ్చాయి కాని ఏం లాభం? చదువుకున్నవారు చదువుకున్నవారినే కాదు, అమాయకులను నిరక్షరాస్యులను వంచనలకు గురిచేసి పీడిస్తున్నప్పుడు చూచి మీరెలా వుండగలరు?

శతాబ్దం క్రితమే మీరు "ఇది శ్రమించవలసినకాలం నేటి మీ కృషిపై భారతదేశ భవిష్యత్తు ఆధారపడి వుంటుంది" అన్నారు మీ మాటలు మననం చేసుకున్న యడల పులకితులమౌతాము కాని, క్రియలో – అంతా శూన్యం! ఏదో ఒక సాకుతో పనులు ఎగగొట్టున్నాం. బంద్‌లు, సమ్మెలు, ఊరేగింపులు, ఇవే నేడు మా నిత్యకృత్యాలుగా ఉన్నాయి.

మీరు ఒక మారు ఉపన్యసిస్తూ "నేను నా సుఖం కోసం ఆరాటపడటం లేదు. వందలాది నరకాలకు వెళ్ళడానికి సిద్ధంగా వున్నాను. ఇతరులకు మేలు చేయటమే నా ధర్మం" అన్నారు.

మీరు చెప్పిన మాటలను వమ్ము చేయటం నేడు మా పని. బుద్ధ, శంకర, కబీర్, రామకృష్ణ పరమహంస, గాంధీజీల ఉపదేశాలకు వ్యతిరేకంగా వ్యవహరించటమే నేటి భారతీయుల ధర్మం. మీ పేరు, మాకు పెట్టుబడి. బతుకులను షేర్ మార్కెట్‌లో విక్రయించటమే నేటి మా వ్యాపారం!

'సంకుచితత్వమే మరణం – విశాల బుద్ధి కలిగి వుండటమే జీవితం' అంటూ మీరు ఘోషించారు. ప్రేమ, శ్రద్ధ, విశ్వాసాలకు నిలయంగా, సహనం, ఆతిథ్యం, ఔదార్యం మున్నగు వాటికి పేరు గాంచిన మన దేశం, ఈనాడు స్వార్థం, ధనదాహం మోసం లంచగొండితనం, పరపీడలకు నిలయమైంది మా రాజకీయ భూపతుల అంతర్యుద్ధాలను గమనించి వూరుకుంటున్నారా?

"మేము దాస్యంలో వున్నాం, దుర్బలులం, అనటమే తప్పు మేము శక్తివంతులం అనుకుంటే మీరు నిజంగా బలవంతులవుతారు అన్నారు మీరు మమ్మ "సింహకిశోరాలు" అన్నారు. నిజమే. ఈనాడు మా నాయకులు మమ్మ కేవలం గొర్రెలంటున్నారు. అలా అంటూ వారు మాపై పెత్తనం సాగిస్తున్నారు.

"మన బీదరికానికి మన సోమరితనమే కారణం" అన్నారు మీరు ఆనాడు. కాని మేము బీదలుగానే వుండాలనుకుంటున్నారు మా నేతలు. ఆలోచనా దారిద్ర్యం, బుద్ధి దారిద్ర్యం ఔదార్య లోపం – ఇవే మాకీనాడు భూషణాలనుకుంటున్నారు.

"లేవండి, బలవంతులు కండి, బాధ్యతలను మోసుకుని ముందుకు సాగండి" అన్న మీ ఉద్బోధ మీతోనే విస్మరింపబడింది. మీరు ఆనాడు ఆ మాట చెప్పారు. 1993 లో మీరు ఈ మాట చెప్పగలరా? మా ప్రభుత్వ

కార్యాలయాల్లో బ్యాంకుల్లో, పంచాయతులనుండి కేంద్ర ప్రభుత్వ కార్యాలయాల్లో, శాసన సభల్లో పార్లమెంటులో మీరు అలా ప్రవర్తిస్తే మిమ్మలను ఘెరావ్ చేస్తారు. మెరుపు సమ్మెకు దిగుతారు. మా వద్ద కిక్ బ్యాక్‌లు సూట్‌కేస్ వ్యవహారాల వంటి బ్రహ్మాస్త్రాలున్నాయి. ఇవన్నీ మీరున్న స్వర్గంలో వున్నాయా, స్వామీ ?

మీరానాడు భవిష్యవాణి వినిపిస్తూ " ఆధ్యాత్మభావం, సత్యం, త్యాగం, సేవ, శ్రమల వంటి లక్షణాలున్నంత కాలం భారత దేశాన్ని ఎవరూ నాశనం చేయలేరు " అన్నారు.

ఇప్పుడు రండి. నేటి భారతం ఎలా వుందో చూద్దురు. ఆధ్యాత్మిక సందేశాల పేర అమాయకపు ప్రజలను దోచుకుంటున్నారు. గత శతాబ్దంలో భారతీయులు కొందరు మిమ్మ మానసికంగా వ్యథకు గురిచేసారు దుష్ప్రచారం జరిపారు. అవన్నీ మాకు తెలుసు. ఈ పత్రిక ప్రతిభ ఈనాడు మరింత విస్తృతమైంది. నిరాధార మైన నిందారోపణలు మాకు కరతలామలకం.

" ఇతరుల సుఖం కోసం నరకానికైనా వెళ్ళండి " పల్లెలకు వెళ్ళి ప్రజాసేవ చేయండి " అన్న మీ పలుకులను శిలాఫలకాలపై చెక్కించి మంత్రులను ఆహ్వానించి ప్రతిష్ఠాపన చేస్తాము. మేము నరకసృష్టికి ఉరకలు వేస్తున్నాం. మీరు మా పల్లెలకు రండి. పల్లెపల్లెనా వెలసిన బార్‌లు, లాటరీ టిక్కెట్లు అమ్మే దుకాణాలు చూసి మేము సాధించిన ప్రగతిని గమనించి విస్తుపోతారు.

బుద్ధుడు, క్రీస్తు, సోక్రటీస్ మున్నగువారు ఉపదేశాలందించి ప్రజలను ద్వారి మళ్ళించారు. మీకెందుకా శ్రమ ? మీరు స్వర్గంతోనే వుండిపోవటం మంచిది ! మీ చికాగో ఉపన్యాస శత జయంతి ఉత్సవాలను జరిపి పత్రికల్లో పేర్లు, ఫోటోలు చూసుకుని మురిసిపోతాం – అంతమాత్రంతో మీరు తృప్తి పడాలి మరి.

" మన పెద్దలను మీరు మరచిపోతే మీకు చివరి రోజులు దాపరిస్తాయి " అని ఇంతకు ముందే మీరు మమ్మ హెచ్చరించారు. కాని మీకూ మేమొక హెచ్చరిక చేస్తున్నాం. మేము మా పెద్దలందరినీ స్మరిస్తున్నాం వారి పేర్లను రహదార్లకు పెట్టాం. శిలావిగ్రహాలు ప్రతిష్ఠింపచేశాము. ఇంతకంటే ఏం చేయాలి ?

'ప్రపంచంలో మానవ సంపద చాలా గొప్పది' అన్నారు మీరు. ఇప్పుడు జనాభా హద్దులధిగమించి పెరిగింది. ఎటుచూచినా జనవాహిని కాని వారిలో మానవులు అపురూపం ! మనిషి కాకుచౌక అయ్యాడు. పనిచేసేవారు కొందరే. అలసులు, మందబుద్ధులు అధిక సంఖ్యాకులు.

స్వామీ, వాస్తవం విన్నవించమంటారా ? మేము పదభ్రష్టులయ్యాము. మీరు మార్గదర్శకులుగా రావాలి. త్వరలో రావాలి. భువినుండి దివికి వస్తూ మొదట భారతదేశానికి రండి. యూరోప్, అమెరికాలకు వెళ్ళకండి. మీ పలుకులు బిథోవన్ సంగీతంలా వుంటాయన్నారు రోమారోలా. కాని ఈనాడు ధ్వనికాలుష్యం ఆవరించింది. మీ సంగీతం వినేవారెవరు ? ఏమైనా మీరొమారు రావాలి– తప్పక రావాలి. లేకున్న యీ దేశానికి దిక్కులేదు. మనిషిని నిర్మించే కృషిని ప్రారంభించిన మీరు అర్ధాంతరంగా వెళ్ళిపోయారానాడు.

'అన్ని మతాలను గౌరవిస్తాము వాటిలోని సత్యాన్ని ఆచరిస్తాము' అంటూ హిందూమత వైశిష్ట్యాన్ని, పరమత సహనాన్ని మీరు మీ చికాగో ఉపన్యాసంలో ప్రబోధించినపుడు సంకుచిత బుద్ధులు అవాక్కయ్యాయి. ఇతర మతాలను గౌరవించనివాడు, తన మతానికికూడా అన్యాయం కలిగిస్తాడని మరోమారు మీరే చెప్పాలి. సహనం, సద్భావం పెంపొందించుటకు మీరు మరోమారు రావాలి.

ఓ స్వామీ, వివేకానందా, దయచేసి మరోమారు రండి. విశాల భావాలను వ్యాపింప చేయండి. ఈ దేశాన్ని రక్షించండి.

# ప్రశ్నలు - సమాధానములు

1) జనాభా తక్కువగా ఉన్న రాష్ట్రం.

2) శరీర ఉష్ణోగ్రతను ఏ గ్రంధి అదుపులో ఉంచుతుంది?

3) విటమిన్-A ను అత్యధికముగా కలిగి యున్న కూరగాయ.

4) గుర్రిడ్డివారికి ముదరిణ ఎవరు కనుగొన్నారు?

5) మొట్టమొదటి సహకార పరపతిసంఘముల చట్టము ఎప్పుడు తయారైంది ?

6) అమెరికన్ గాంధీ అని ఎవరికి పేరు ?

7) ఆంధ్రవిశారద అని ఎవరికి పేరు ?

8) ఇంగ్లీషు చదువులు మన దేశంలో ప్రవేశ పెట్టినవాడు ఎవరు?

9) ఉత్తర భారతదేశపు బైబుల్ ఏది - ఎవరన్నారు ?

10) కంగారు అన్న జంతువుకు పేరు పెట్టిన దెవరు ?

11) గయోపాఖ్యాన నాటక రచయిత

12) చండాలుని గురువుగా స్వీకరించినవాడు.

1) సిక్కిం 2) ఎడ్రినల్ 3) క్యారట్ 4) బెర్రియులి 5) 1894 6) మార్టిన్ లూథర్ కింగ్ 7) తాపీ ధర్మారావు 8) మెకాలే 9) తులసీదాస రామచరిత్ర మానస్-సర్ జార్జి గ్రియర్సన్ 10) కెప్టెన్ జేమ్స్ కుక్ 11) చిలకమర్తి 12) ఆదిశంకరాచార్య

## శ్రీవాణి జీవిత సభ్యులు



గోదావరి ధర్మరాజు
మద్రాసు - 600 081



దేవత వెంకట సీతారామాంజనేయ స్వామి (అంజి)
నందిగామ - 521 185



శ్రీమతి నల్లాని శకుంతలమ్మ
W/O శ్రీ ఎన్. అప్పారావు
ముప్పాళ్ళ

శ్రీవాణి

స్నాతకోత్సవ ప్రసంగం

# నైతిక ధార్మిక శీలసంపదలు ఇనుమడింపజేయునదే విద్య

.భగవాన్ సాయి దివ్యజ్ఞాన ప్రబోధ

" విద్యానామ నరస్యరూపమధికం
విద్యన్న గుప్తం ధనం
విద్యాభోగకరీ యశస్సుభకరీ
విద్యాగురూనాం గురుమ్
విద్యా బంధుజనో విదేశగమనే
విద్యా పరం లోచనమ్
విద్యారాజ పూజితే నహి ధనం
విద్యా విహీనం పశుమ్ "

ఈ ప్రపంచమునందు విద్యార్థికి విద్యయే సౌందర్యం, విద్యయే గుప్తమైన ధనం. విద్యయే విద్యార్థికి కీర్తి, సౌభాగ్యము, సంపద. విద్యయే గురువులకంటే గురువు మనము విదేశాలకు వెళ్ళినప్పుడు బంధువు. విద్యయే మానవునికి మూడవ నేత్రము. రాజ్యసభలో విద్యకే ప్రధానమైన స్థానంగాని, ధనమునకు కాదు. ఇట్టి పవిత్రమైన విద్యలేనటువంటివాడు పశువుతో సమానము.

విద్యార్థులారా! విద్యాబోధకులారా!

ఈనాడు 'విద్య' అనగా ఏమిటో, విద్యార్థులకుగాని, అధ్యాపకులకుగాని తెలియటంలేదు. నైతిక, ధార్మిక, శీలసంపదలను ఇనుమడింపజేయునదే విద్య. ఈనాడు ప్రపంచములో మానవుడు అనంతమైన శాస్త్రజ్ఞానమును సంపాదించాడు, కాని కేవలం బాహ్యమైన నాగరికతకు మాత్రమే తోడ్పడుతున్నది, పిల్లలకు బోధింపబడుతున్నది. మానవుడికి ఈనాడు కావలసింది బహిర్ముఖమైన సౌందర్యము కాదు. ఈనాడు మానవునికి కావలసినది హృదయ పరివర్తన. ఇది కేవలం ఆంతరంగికమైన సంస్కృతి ద్వారానే మనకు లభ్యమవుతుంది. ఈనాడు మానవుని, మానవుడుగా మార్చినంతమాత్రమున చాలదు. మానవుని ఆదర్శవంతమైన మానవునిగా మార్చాలి. మానవుని దయామయునిగా మార్చునదే సరియైన విద్య. అప్పుడే ఈ విద్యకు పరిపూర్ణత ఏర్పడుతుంది. కనుక 'విద్య' అనగా కేవలం గ్రంథ పరిచయమనిగాని లేక ప్రాకృతమైన, లౌకికమైన యీ జగత్తులో జీవించుటకు ఒక ఆధారమనిగాని భావించరాదు. ఈనాటి విద్యార్థి తన జీవితమునకు ఏది ఆధారమో, జీవితమునకు ఏది ప్రమాణమో, ఏది ప్రధానమో నిర్ణయించుకోలేకపోతున్నాడు కనుకనే యీనాటి మానవుడు ఆత్మవిశ్వాసమును కోల్పోతున్నాడు. దైవభక్తి, దేశభక్తి ఈనాటి విద్యార్థి కోల్పోవటంచేతనే తనను తానే నమ్మలేకపోతున్నాడు. ఈనాడు ప్రపంచంలో జరుగు అనేక విధ్వంసాలకు మూలకారణం ఆత్మవిశ్వాసమును కోల్పోవటమే. కనుక...

" పాపభీతి లేని పామరత్వము బట్టె
దైవభీతిలేని దాని బట్టె
మానవత్వమణగె మానవులందున
విశ్వశాంతికిదియె విప్లవంబు "

" నిత్య సత్య సుకృతులన్ని లిఖితరూపు పొందుచుండె, పవిత్ర ప్రకృతి ఈనాడు ప్రజల

వీడి పోవుచుండె, ఆర్య వేద విద్యలణిగే, దుర్విద్యలు పెరుగుచుండె" ఇట్టి పరిస్థితులయందు ఈనాటి యువకులలో ఏ విధంగా నైతిక ధార్మిక ఆధ్యాత్మిక భావములు పెంపొందుతాయి ? విద్యా విధానం మారాలి. విద్యయొక్క అంతరార్థమును గుర్తించటానికి ప్రయత్నించాలి. "చదివి వ్రాయ నేర్చిన వారందరూ విద్యావంతులేనా ? కాలేజీ డిగ్రీలు పొందిన విద్యావంతులగునా ? సుజ్ఞానం, సుకృతములు లేని విద్యలు సద్విద్యలగునా ? బ్రతుకుటకే విద్య యన్న బ్రతుకలేని పశు పక్షులు ? కనుక మానవత్వంలో జీవితానికి ప్రాణం వంటిది ఈ విద్య. అట్టి జీవిత సమానమైన విద్యను ఈనాడు కోల్పోయి, జీవనోపాధి నిమిత్తమై ప్రజలు ప్రాకులాడుతూ, జీవితమంటే ఏమిటో గుర్తించుకోలేక పోతున్నారు.

"శీలమే జీవనం, శీలమే శక్తి, శీలమే పవిత్రము" ఇట్టి శీల రహితమైన మానవుని యందు పవిత్రతగాని, శక్తిగాని, జీవనముగాని ఏ విధంగా కొనసాగించుకోగలరు ? కనుకనే మానవుని యందు శీల సంపత్తిని అనాది కాలంగా పోషించుకుంటూవచ్చారు. ఇలాంటి ప్రాచీన భారతీయ సంస్కృతిని విస్మరిస్తున్నారు ఈనాటి విద్యార్థులు. కేవలం లౌకికమైన, భౌతికమైన, ప్రాకృతికమైన క్షణభంగురమైన విద్యల నభ్యసిస్తూ, తమ జీవితాన్ని గుర్తించుకోలేక పోతున్నారు. మానవుడు విద్యయొక్క విశ్వస్వరూపాన్ని గుర్తించాలి. ఈనాటి విద్యలన్నియూ యాంత్రికంగా కొనసాగుతున్నాయి. ఈనాటి విద్యార్థి మేధాశక్తితోపాటు హృదయమును కూడా వికసింపజేసుకోవాలి కేవలం తెలివితేటలను పెంచుకోవటం కాదు. ఈనాడు మానవుడు భౌతికమును మాత్రమే ఆశిస్తూ, నైతిక ధార్మిక విషయాలను విస్మరిస్తున్నాడు. ఈనాటి మానవుని జీవితం తిరోదాయకంగా ఉంటున్నది. ఈ తిరోదాయకమునుంచి పురోదాయకము అయినప్పుడే ఈ విద్యావిధానం అభివద్ధి గాంచగలదు ఈ తిరోగతిని, పురోగతిగా మార్చకున్న విద్య అధోగతిపాలవుతుంది. కనుక సరియైన విద్యను విద్యార్థులకు ప్రబోధించాలి.

ఈనాడు సైన్సు పేరుతో ప్రకృతిని, పంచభూతములను మానవుడు Exploitation (స్వలాభమునకు ఉపయోగించుకొనుట) చేస్తున్నాడు ఇది సరియైనది కాదు. భయంకరమైన బాంబులను తయారుచేస్తున్నాడు. ఇవియే ప్రధానమని భావించడం అవివేకమే గాని వివేకం ఏమాత్రం కాదు. వైజ్ఞానికంగా అభివృద్ధిగాంచినామని అహంకార పడుతున్నారే గాని, ఇది నిజమైన వైజ్ఞానం కానే కాదు దేశమును నాశనం గావించే వైజ్ఞానం విజ్ఞానమా ? ఇదే సైన్సును ప్రజలకు, దేశమునకు, సమాజమునకు ఉపయోగపడే విధంగా ఎందుకు కనిపెట్ట కూడదు ? ఈనాడు కనిపెట్టిన సైన్సు విషయాలు, అనాడు హిరణ్యకశిపుడు కనిపెట్టిన దానికన్నా ఎక్కువైనవేమీ కావు. ఈ శక్తులు కేవలం దుర్మార్గమైన శక్తులే ఈ సైన్సు, టెక్నాలజీ ప్రధానమని భావిస్తున్నారు ఈనాడు ఇవి తాత్కాలికమైన భౌతికమైన సుఖాలను అందిస్తున్నాయే గాని, అంతరంగికమైన విశ్వాసాన్ని పూర్తిగా నిర్మూలనం గావిస్తున్నాయి. కనుక ప్రజలకు ఉపయోగకరమైనటువంటిది, బాలబాలికలను సరియైన మార్గంలో ప్రవేశింపబెట్టునది, దేశోద్ధారము గావించునది, దేశ శ్రేయస్సుకు తోడ్పడునట్టి విద్యను ఈనాడు కనిపెట్టాలి ఈ విధమైన వివేకమును మానవుడు ఏనాడు కనిపెట్టునో, ఆనాడే విశ్వశాంతి మనకు చేకూరుతుంది.

ఈనాడు రాగద్వేషములతో దూషితము కాని చిత్తము అసత్యముతో దూషితము కానటువంటి సత్యము, హింసతో దూషితం కానటువంటి దేహము, అసత్యాలతో దూషితం కానటువంటి వాక్కు చాలా అవసరం. దీనినే The proper study of mankind is Man అన్నారు. కాని ఈనాడు మానవుడు తన మనుగడకు

మూలమైన దానిని గుర్తించుకోలేక, రాగద్వేషములతో దూషితమవుతున్నాడు మానవుడు అసత్య వాక్కులతో దూషితమవుతున్నాడు హింసాదులతో దూషితమవుచున్నది దేహము. కనుక చిత్తము, వాక్కు, దేహము ఈ మూడింటి పవిత్రతను అందించేటటువంటి విద్యను ఈనాడు విద్యార్థులకు బోధించాలి.

శిలాహృదయుడు, కఠిన హృదయుడైన చర్చిల్ సహితం యీ సైంటిస్టులు చేసే విషయాలను చూచి ఒకానొక సమయంలో చాలా విచారించాడు. మానవుడు అన్నీ కనిపెడుతున్నాడు. అన్ని విషయాలు తెలుసుకోగలుగుతున్నాడు కాని తనను తాను తెలుసుకోలేకపోతున్నాడు మానవుడు. తనను తాను తెలుసుకోలేనటువంటివాడు ఎన్ని తెల్సుకొని ప్రయోజనం ఏమిటి? కేవలం స్వార్థంతో, స్వప్రయోజనం నిమిత్తమై తాము యీ విద్యలను అభివృద్ధి గావించుకుంటున్నారు వైజ్ఞానికులు. తమ పేరు ప్రతిష్ఠలకోసం పాటుపడుతున్నారేగాని, దేశం నిమిత్తమై, ప్రజల నిమిత్తమై ఏవిధమైన విచారణలు వారు చేయటంలేదు. "కీడు కీటకమైనా చేస్తుందిగాని, మేలు మహేశ్వరుడైనా చేయలేడు." ప్రజలకు ఉపయోగకరమైనవి చేసినప్పుడు వీరు ఎంతో ధన్యులవుతారు అయితే ఈనాడు మానవుడు వేసే ప్రతి అడుగు ధర్మం తప్పుతున్నది. మానవుడు పలికే ప్రతి పలుకు అసత్యముతో కూడుకొని ఉంటున్నది. ఆలోచనలు దురాలోచనలతో కూడి ఉంటున్నాయి. కోరే కోరికలు స్వార్థ భూయిష్టంగా వుంటున్నాయి. మానవునియందు చైతన్యం చల్లబడిపోతున్నది. కుల మత ద్వేషములు పెరిగిపోతున్నాయి. ప్రాంతీయ దురభిమానములు అంతకంటే మించిపోతున్నాయి. కామ క్రోధ ద్వేషాలు మితిమీరిపోతున్నాయి. మొత్తంమీద చెప్పాలంటే మానవత్వమే కూలిపోతున్నది. ఈ మానవత్వంలేని మానవుడు, మానవుడని ఎట్లా అనిపించుకోగలడు? ఈనాడు మనసులో ఒకటి, మాటయందు మరొకటి, క్రియయందు వేరొకటి.



ఇంతియేగాక యీనాడు ఆదర్శవంతమైన నాయకులు మనకు కనిపించటంలేదు. ఆదర్శవంతమైన తల్లిదండ్రులూ కనిపించటంలేదు. ఆదర్శవంతమయిన అధ్యాపకులూ కనిపించటంలేదు.

ప్రాచీనకాలమునందు రాజకీయ నాయకులు, తల్లిదండ్రులు, అధ్యాపకులు ఆదర్శవంతమైన జీవితాన్ని అందిస్తూవచ్చారు. అయితే యీనాడు యీ ముగ్గురూ పెడమార్గమును పట్టటంచేతనే వీరికి ఏమాత్రం చెప్పే అధికారం లేకుండాపోతున్నది. తెలుగు భాషలో సామెత ఉన్నది. "ఆవు చేలో మేస్తుంటే దూడ గట్టుపైన ఉంటుందా?" ఆవుతోపాటే దూడకూడా పోతుంది. అదేవిధముగనే యీనాటి రాజకీయ నాయకులు, తల్లిదండ్రులు, అధ్యాపకులు పెడమార్గము పట్టడం చేతనే పిల్లలుకూడా పెడమార్గమున పోతున్నారు. పిల్లల్లో దోషమేలేదు పిల్లలు లేతహృదయులు. పవిత్రమైన భావం గలవారు. కాని ఇలాంటి

వారిని చెడగొడుతున్నారు. కనుక మొట్టమొదట దేశ నాయకులు, తల్లిదండ్రులు, అధ్యాపకులు యీ విద్యా విషయాన్ని చక్కగా విచారణ చేసుకోవాలి. అయితే ఈనాడు "మా పిల్లవాడు పెద్ద డిగ్రీలు తీసుకోవాలి! విదేశాలకు వెళ్ళాలి! లక్షలు లక్షలు గడించాలి!" అని తల్లిదండ్రులు ఆశిస్తున్నారు. ధనమున్నవారు ఈ జగత్తులో ఎందరు లేరు? విద్యావంతులు ఎంతమంది లేరు? అయితే వీరందరికి సుఖమున్నదా? వీరు ఆనందాన్ని అనుభవిస్తున్నారా? లేదు...లేదు...మన ఆనందం ధనంలోలేదు, విద్యలో లేదు. మన ఆనందం గుణములో మాత్రమే ఉన్నది. కనుక ఈ గుణమును పెంచుకొనటానికి మన నడతలు మంచిగా ఉండాలి. మంచి నడతలు ఉండినప్పుడే మంచి గుణవంతుడు కాగలడు. మంచి గుణవంతుడైనప్పుడే మంచి నాయకుడుగా రూపొందగలడు. ప్రజాసేవలో పాల్గొనాలి. సేవ చేయకుండా నాయకుడు ఎలా కాగలడు? మనయొక్క సుఖము, ఆనందము సమాజంపైన ఆధారపడి ఉన్నది. సమాజ సుఖమే మన సుఖము. కారణమేమనగా సమాజంలో మనం వ్యక్తులం. కేవలం నీ స్వసుఖం మాత్రమే నీవు కోరుకుంటే నీకు సుఖము ఏ విధంగా లభ్యమవుతుంది? మొట్టమొదట నీవు సుఖపడాలంటే సమాజమును సుఖపెట్టాలి. సమాజ సుఖమును కోరాలి సమిష్టి ఆనందంలోనే నా ఆనందం యిమిడివున్నదనే సత్యాన్ని గుర్తించాలి ఇలాంటి విశాల భావములను యీనాడు అధ్యాపకులుగాని, తల్లిదండ్రులుగాని బోధించడంలేదు. ఎంతటి గొప్ప పదవిలోనున్నా, ఎంతటి విద్యావంతుడైనా— దానితోపాటు మనయొక్క గుణమునుకూడా పెంచుకోవాలి. మానవతను పెంచుకోవాలి అయితే ఈనాడు మానవుడు భౌతికమైన సిద్ధాంతములను ఎన్నియో సాధిస్తున్నాడు, పదార్ధ పరిశోధనలు ఎన్నో చేస్తున్నాడు, కాని తన మానవత్వాన్ని తాను ఎంతవరకు విలువుకోగలుగుతున్నాడు? మానవతా గుణములను ఎంతవరకు రక్షించుకోగలుగుతున్నాడు? ఇదే ఈనాడు ప్రపంచం వేసే ప్రశ్న? దీనికి జవాబు ఏమాత్రం కనిపించటంలేదు.

అలనాటి ప్రాచీన భారతీయ పవిత్ర చరిత్రలు విచారణ చేసుకుంటే సత్యమును గుర్తించటానికి వీలవుతుంది. పాండవులు అరణ్యవాసం చేస్తున్న సమయంలో వారిని విచారించే నిమిత్తమై కృష్ణుడు అక్కడికివెళ్లాడు ఆ సమయంలో అక్కడ ధర్మజుడు ఒక్కడే వున్నాడు. "బావా! సోదరులు ఎక్కడ?" అని అడిగాడు. ధర్మజుడు "కొంతమంది హస్తినాపురంలో వున్నారు, మరికొంతమంది కందమూలాలు తీసుకొని రావటానికి వెళ్లారు" అని సమాధానం చెప్పాడు కృష్ణునికి ఆశ్చర్యం వేసింది "బావా! ఏమైనా మతిపోయిందా? ఐదుగురు అరణ్యములోనే వున్నారు గాని, హస్తినాపురంలో ఎవరున్నారు? అని అడిగాడు కృష్ణుడు. 'కృష్ణా! వ్యక్తిగతమైన ద్వేషములు ఎన్నియో జరుగవచ్చును. కౌరవులు కూడా మా సోదరులేగదా!" అన్నాడు ధర్మజుడు. అదే విధముగనే వ్యక్తిగత ద్వేషములు; వ్యక్తిగత అభిప్రాయములు, వ్యక్తిగత సిద్ధాంతములు వేరువేరుగా వుండవచ్చును కాని దేశము యొక్క విశ్వాసం, ప్రజలయొక్క క్షేమము ఒక్కటిగానే వుంచుకోవాలి. మన వ్యక్తిగత విషయాలను సమాజంపై రుద్దరాదు. మాలో మాకు ఏమైనా అభిప్రాయ బేధములు వస్తే మేము ఐదుగురు సోదరులం, వారు నూరుమంది సోదరులు. దేశమునకు ఏదైనా ప్రమాదం వస్తే మేము నూట ఐదుగురు సోదరులం కలసి పోరాడుతాం. దేశమునకు అపకారం రాకుండా చూస్తాం. అది మా కర్తవ్యం. అది మా రక్తంలో వుండిన ధర్మమన్నాడు ధర్మజుడు. కాని ఈనాడు మీ పార్టీ మీది, మా పార్టీ మాదని ప్రజలను హింసిస్తున్నారు. దేశం యొక్క ప్రగతి దెబ్బతింటున్నది వ్యక్తికి వ్యక్తికి మధ్య ద్వేషం వుండవచ్చును. అభిప్రాయాలు భిన్నంగా వుండవచ్చును కాని ప్రజల క్షేమం, దేశం క్షేమం విషయంలో మాత్రం అందరిలో ఒకే భావం వుండాలి. ప్రాచీన చరిత్రలు ఇలాంటి ఆదర్శమును అందించినాయి.

ఈనాటి విద్యలు విద్యార్థిని శిలాహృదయంగా చేస్తున్నాయి. దయా ప్రేమలను నశింపజేస్తున్నాయి. ఏమాత్రం 'ప్రేమ' అనేటటువంటిది కనిపించడంలేదు ఒకనాడు గాంధీజీ చాలా విచారంతోకూర్చున్నాడు ఒక విదేశీయుడు వచ్చి "గాంధీజీ! ఏమిటి మీరు విచారిస్తున్నారు? మిమ్ములను విచారింపజేసేటటువంటి సమస్య ఏమిటి?" అని అడిగాడు. అప్పుడు "ఈనాటి విద్య మానవునికి మృదుమధురమైన జీవితాన్ని లేకుండా, కఠినమైన శిలాహృదయుడుగా మారుస్తున్నది" అన్నాడు గాంధీజీ కనుక యీనాడు యీ విద్యల వలన విద్యార్థుల హృదయం కఠినమైనదిగా రూపొందుతున్నది ఏ విద్యార్థిని పలుకరించినా మృదుమధుర మైన వాక్కేలేదు చేసిన మేలును కూడా మరచిపోయి కృతఘ్నులుగా మారిపోతున్నారు. ఇలాంటి విద్యలు నేర్చి ప్రయోజనం ఏమిటి? "చదువుకున్న వాడికంటే చాకలి మేలు" అని పూర్వం అనేవారు. నీవు చాకలివానికి వేసే వస్త్రముల వివరాలు పుస్తకంలో వ్రాసుకుంటావు. చాకలి ఎంతోమంది దగ్గర గుడ్డలు తీసుకొనివెళ్ళతాడు. ఎక్కడా వ్రాసుకోడు కాని ఎవరికి వారికి ఉతికి అప్పజెప్పుతాడు ఎవరి తెలివితేటలు గొప్పవి? యీ చదివిన వానికి, ఆ చదవని వానికి వ్యత్యాసం ఎంత గొప్పదో యోచించండి. ఈనాటి విద్యార్థులు కేవలం సంకుచితమం ఐ మార్గంలో ప్రవేశిస్తున్నారు. మన చుట్టూ ప్రపంచమున్నదనే సత్యాన్ని వీరు మరచిపోతున్నారు. గౌరవ మర్యాదలు ఏ విధంగా సంపాదించుకోవాలనే విధి విధానాన్ని గుర్తించుకోలేకపోతున్నారు

విద్యార్థులకు మొట్టమొదట వుండవలసినది "వినయము, నిరహంకారము, నిస్వార్థం" యీ మూడే సౌందర్యమైన నగలు. ఈ మూడూ లేకపోతే విద్యార్థి ఏమాత్రం శోభించదు, రాణించదు. వినయముతో స్వార్థాన్ని దూరం చేసుకోవాలి, నిరహంకారంగా జీవించాలి. కాలేజీలో చేరటంతోనే మంచి సఫారీ డ్రస్ కావాలి. తల్లిదండ్రులు ఏ విధమయిన బాధలు పడుతున్నారో విచారణ చేయరు. అప్పుడేనా ఈ విధమయిన దుస్తులు అందించాలి. ఇవి విద్యార్థి కోరవలసిన కోరికలేనా? తను కన్నవారికి ఎంత శ్రమ నందిస్తున్నాడు? ఇలాంటి కుమారులను కూడా మెచ్చుకుంటున్నారు కొంతమంది తల్లిదండ్రులు. ఇలాంటి వారిని ధృతరాష్ట్రుని సోదరులనే చెప్పవచ్చును.

# భావరాజు వారికి శ్రద్ధాంజలి

వాణి మాస పత్రికను ప్రారంభించాలనే తలంపు వచ్చినప్పటి నుంచి, ఎప్పటికప్పుడు అవసరమైన, అమూల్యమైన సూచనలు చేస్తూ, సలహాలనిస్తూ, వ్యాసముల నందిస్తూ (శ్రీ)వాణికి అండగానిలిచి స్ఫూర్తినిచ్చిన "త్రివేణి" సంపాదకులు డా॥ భావరాజు నరసింహారావుగారు ది 27-11-93 న హైద్రాబాద్‌లో పరమపదించారని తెలియబరచుటకు విచారిస్తున్నాను. గత తరంవారికి వర్తమాన తరం వారికి భావరాజువారు ఒక వారధిలాంటివారు. వీరు అన్ని రంగాలలో నిష్ణాతులు. ఒక్క మాటలో చెప్పాలంటే వీరు Encyclopedia అంటే అతిశయోక్తి కాదు. ఇటువంటి మహోన్నతమైన మనీషిని బందరు పట్టణం కోల్పోవటం మరద్రష్టకరం. కీ॥ శే॥ భావరాజువారికి శ్రద్ధాంజలి ఘటిస్తూ వారి ఆత్మశాంతికి పరమేశ్వరుని ప్రార్థిస్తున్నాను

— సం.

## ప్రకటనదారులకు మనవి

కొంతమంది ఉదారవదాన్యులు తమ ప్రకటనలు (Advertisements) ప్రతి జన్మదిన సంచికకు అందించి వాణిని ప్రోత్సహిస్తున్నారు. 1994 సం॥ జనవరి సంచికను ప్రత్యేక సంచికగా ఈ తడవ ముద్రించడం లేదు. అందువలన ప్రకటనల కోసం ప్రత్యేకంగా ఎవరినీ కోరటంలేదు. పది సంవత్సరములు శ్రీవాణి పూర్తి చేసుకొన్న సందర్భమున దశాబ్ది ప్రత్యేక సంచికను 1995 జనవరి లో ముద్రించ దలచినాము. ఆ శుభ సమయమున ప్రకటనలందించి శ్రీవాణిని ప్రోత్సహించమని ప్రార్థిస్తున్నాను. ధన్యవాదములు.

— సం.

దుర్యోధనుడు ఏ చెడ్డపనులు చేసినప్పటికినీ,ధృతరాష్ట్రుడు మంచిది ... మంచిది ... అని తల ఊపుతూవచ్చాడు. సాక్షాత్ హరిశ్చంద్రుడు వచ్చి చెప్పినా వినరు గాని, తన కుమారుడు వచ్చి చెబితే తప్పకుండా విశ్వసిస్తారు. ఇంతటి దురభిమానం పెరిగిపోయింది ఈనాడు తల్లిదండ్రులలో. ఈనాడు ప్రపంచంలో జరిగే అల్లకల్లోలములన్నింటికినీ ఈ దురభిమాన దురహంకారములే మూలకారణం. తల్లిదండ్రులే ధైర్యంగా చెప్పకపోతే బయటవారు ఏ విధంగా చెబుతారు ? కనుక విద్యార్థులను చెడగొట్టేది మొట్టమొదట తల్లిదండ్రులే. కనుక బిడ్డలను ఆదర్శవంతమైనవారిగా తీర్చిదిద్దాలి. కనుకనే చెప్పారు. "పుత్రోత్సాహము తండ్రికి పుత్రుడు జన్మించినపుడె పుట్టదు జనులా ! పుత్రుని గనుగొని పొగడగ, బుత్రోత్సాహంబునాడు పొందుర సుమతీ ! ఏనాడు ప్రజలు నీ కుమారుడు మంచివాడని పొగుడుతారో, అప్పుడు నిజమైన Birth day (జన్మదినం) చేసుకోవాలి కేవలం కుమారుడు పుట్టి, తల్లిదండ్రులకు అపకీర్తి తెచ్చి, చెడమార్గమును పట్టి, లెక్కచేయకుండా ప్రవర్తించేవాడి జన్మదినం తల్లిదండ్రులు ఏ విధంగా చేయగలరు ? కనుక మనకు పుట్టిన దినం ఏమిటి ? ఏనాడు మనలో సుగుణములు ఆవిర్భవిస్తాయో అదియే మన నిజమయిన పుట్టిన దినం. కనుక మనం సుగుణాలను పెంచుకోవాలి. నీకు Marks రాకపోయినా ఫరవాలేదు, Remarks రాకుండా చూచుకోవాలి. కనుక కేవలం డిగ్రీల కోసం ప్రాకులాడవద్దు. ఆదర్శవంతమయిన విద్యార్థిగా రూపొందాలి. మాటలందు Hero పనులందు Zero. ఈనాడు ఇది మనలో అభివృద్ధి జెందుతున్నది. ఈనాడు విద్యార్థులు సోమరిపోతులవుతున్నారు. తినటం,తిరగటం ఇది కాదు విద్యార్థుల ప్రధాన ఆదర్శం. 'కష్టేఫలి' నీవు నడుమువంచి పని చేయాలి. ఇంతకాలం నిన్ను రక్షించి, పోషించిన తల్లిదండ్రులకు సేవ చేయాలి. యీ ఇరువురి సంతోషపెట్టలేని నీవు, ఇంక దేశాన్ని ఏ రీతిగా సంతోషపెట్టగలవు? ఇదా ! మనం నేర్చుకున్న Technology ? ఇది Technology ( టెక్నాలజీ ) కాదు, Trick knowledge (ట్రిక్ నాలెడ్జి) కనుక యీ 'ట్రిక్' లో మనం ప్రవేశించకూడదు. విద్యార్థులు శాంతి, ప్రేమ, దయలను పెంచుకోవాలి, సద్గుణాలను పెంచుకోవాలి.

దేహానికి ఐదు ప్రాణాలుంటున్నాయి. ప్రాణ, అపాన, వ్యాన, ఉదాన, సమాన. నిత్యజీవితంలో ఈ ఐదు ప్రాణములు ఏమిటి ? దేహానికి ఉంటున్నాయి ఐదు ప్రాణములు. కాని విద్యార్థికి ఏమి ప్రాణములుంటున్నాయి ? సత్యము, ధర్మము, శాంతి, ప్రేమ, అహింస. ఇందులో ఏ ఒక్కటి లేకపోయినా జీవితం రాణించదు. ఈ ఐదింటిని ఏకత్వం గావించుకొని,

మనలో వున్నటువంటి సంప్రదాయాన్ని పెంచుకోవాలి. మన సంప్రదాయాన్నే మనం పెంచుకొనలేనివారు సంస్కృతిని ఏరీతిగా అనుభవించగలరు? మనలో వున్నటువంటి సహనం, సానుభూతి, ఏకత్వం మనం పెంచుకోవాలి. ఈ ఏకాత్మభావం చేతనే ప్రపంచమంతా ఒకటిగా మారుతుంది అదియే ప్రేమతత్త్వము ఆ ప్రేమ అందరియందు అంతర్వాహిణిగా ఉంటున్నది. ప్రేమలేని జీవితం శవంతో సమానమే ఆ ప్రేమ వుండినప్పుడే సత్యమును నీవు పలుకుతావు, ధర్మమును ఆచరిస్తావు, శాంతమును అనుభవిస్తావు, అహింసను పాటిస్తావు. కనుక అన్నింటియందును ప్రేమయే అంతర్వాహిణి. కనుక యీనాటి విద్యావిధానంలో అధికారులుకూడా గుర్తించి, కొన్ని మార్పులు తీసుకొని రావాలి. ఏమి మార్పులు తెప్పిస్తున్నారు? విద్యాశాఖా మంత్రి మారినప్పుడల్లా రూల్సు మారుస్తున్నారు కాని మారని, తీరని, చేరని, చెరపని ఒక సిద్ధాంతాన్ని మనం స్థిరం చేసుకోవాలి. ఎన్నో కమిటీలు వేశారు. ఏమిటి ఈ కమిటీలు? Come for Tea అంతే. ఇంతకంటే మించిందిలేదు. ఏ కమిటీ అయినా ఒక దానిని స్థిరంగా నిలబెట్టారా? ఎవ్వరూ నిలబెట్టలేదు. ఒక మీటింగు, ఒక రిపోర్టు, మరొక మీటింగు, మరొక రిపోర్టు. ఆ రిపోర్టు ఎక్కడికిపోతున్నదో ఎవరికీ తెలియదు. ప్రజల వద్దకు చేరనే చేరటంలేదు. ప్రపంచమంతా విద్యారంగంపై ఆధారపడి ఉంటున్నది. కనుక విద్య జీవితానికే ప్రధానమైనటువంటిది. దేనికైనా విద్య చాలా అవసరం అట్టి ప్రాణసమానమైన, ప్రధానమయిన విద్యను ఈనాడు మనం సరిగా అర్థం చేసుకోవటంలేదు. కనుక సత్య ధర్మ శాంతి ప్రేమ అహింసల తత్త్వాన్ని చక్కగా నిరూపించాలి.

" సత్య ధర్మ ప్రేమ శాంతులు లేకున్న
విద్యలన్నియు నేర్చి విలువ సున్న
సత్య ధర్మ ప్రేమ శాంతులు లేకున్న
పదవుల నేలిన ఫలము సున్న
సత్య ధర్మ ప్రేమ శాంతులు లేకున్న
బహుళ సత్కార్య లాభంబు సున్న
ఈ సనాతన ధర్మ హార్మ్యంబు నిలువ
గుణములివి నాల్గు పునాది గోడలప్ప
ఇంతతన్నను వేరెద్ది ఎఱుక పఱతు
సాధు సద్గుణ గణ్యులౌ విద్యార్థులారా! "

ఓ విద్యార్థులారా!

మనము సత్య ధర్మ శాంతి ప్రేమలను పెంచుకొనకుండినా నిజముగా సరస్వతికి అపకారము చేసినవారమే అవుతాం. ఈనాటి మానవునకు త్యాగమనేదే తెలియదు. త్యాగం చేయని రాజకీయం ఏవిధంగా వుంటుంది? "న కర్మణా న ప్రజయా ధనేన త్యాగేనైకే అమృతత్వ మానశుః" ఇది వేదము. మనం కర్మలో త్యాగం చేయాలి. మనం ఫలితాన్ని కోరే కర్మను ఆశిస్తున్నాం. ఫలితాన్ని కోరక నీ కర్తవ్యాన్ని నిర్వర్తించు "కర్తవ్యం యోగముచ్యతే" ఈ కర్తవ్యాన్ని మనం నిర్వర్తించినప్పుడే, నిజమైన త్యాగం మనలో ఆవిర్భవిస్తుంది. ఈ త్యాగమే యోగముగా మారిపోతుంది. 'యోగం కర్మకౌశలమ్' అన్నారు.

విద్యార్థులారా!

ఈనాడు విద్య నభ్యసిస్తున్నామని, ఉన్నత విద్య కోసం విదేశాలకు వెళ్ళాలని— యీ పిచ్చిభ్రాంతులు కొంత మానుకొని, నీ దేశాన్ని, నీ గ్రామాన్ని, నీ పట్టణాన్ని, నీ ప్రజలను మీరు సమృద్ధి గావించి, సరియైన సేవలు చేయటానికి పూనుకోండి.

" విద్య డిగ్రీల కొఱకను వెర్రి వీడి
సేవకావృత్తికై మీరు చెందబోక "

విద్య నేర్చుకోవటం అంటే సేవకావృత్తిని చేబట్టటానికి కాదు. నీ 'కాన్షస్'కు నీవు తృప్తికరంగా నీవు సేవ చేయాలి. మన దేహంలో విద్య ఎంతో ప్రకాశ

వంతంగా వుంటున్నది. అదే ఆత్మవిద్య. "మేఘములు మింటిపై చేరి మెదలుచుండ విద్యుల వెనుక జ్ఞానంబు వెలయువలయు" అట్లు వెలిగినప్పుడే నిజమైన మానవత్వము. మానవత్వాన్ని పెంచుకోవాలి. మానవ జీవితమంటే ఏమిటో అర్థం చేసుకోవాలి మానవ జీవితము అనుభవించదగినది, చాలా సారవంతమైనది, చాలా పవిత్రమైనది, జీవించదగినటువంటిది. అట్టి మానవత్వాన్ని మనం యీనాడు కోల్పోతున్నాం. కేవలం రాక్షసులకంటే హీనంగా ప్రవర్తిస్తున్నాం. పశువులలోకూడా యింత కఠినత్వం ఉండదు. ఒక పశువు మరొక పశువును చూచి ఈర్ష్యా అసూయలు చెందదు. మానవుడు అట్లు కాదు మంచివారిని చూచి అసూయ, పైకి వచ్చేవారిని చూచి అసూయ, సుఖపడేవారిని చూచి అసూయ, పేరు ప్రతిష్ఠలు వచ్చేవారిని చూచి అసూయ. పశువులకంటే హీనమైన గుణములు వుంటున్నాయి. మానవుడుగా పుట్టినందుకు ఈ దుర్గుణాలకు దూరంగా ఉండాలి నేను మానవుడినే, అతనూ మానవుడే. అతనూ సుఖాన్ని అనుభవించాలి, నేనూ సుఖాన్ని అనుభవించాలి ఈ విధమైన సమత్వానికి తగినటువంటి వ్యక్తిత్వాన్ని మనం పోషించుకోవాలి ఈనాడు వ్యక్తిత్వమనేదే లేదు, ప్రతిదానియందు కూడనూ స్వార్థం...స్వార్థ ... ఈ స్వార్థమును మనం ఏనాడు దూరంగావించుతామో ఆనాడే పరార్థం మనలో ప్రవేశిస్తుంది. ఈ పరార్థంలో ప్రవేశించనంతవరకునూ మనం పశువులమే గాని మనుషులం కానే కాదు. మనం ఆకారాన్ని చూచి మనుషులం అనుకుంటున్నాము గాని, ఆచరణలో చూస్తే పశువులకంటే హీనం. ఈనాటి చదువులన్నీ కూడనూ పొట్టకూటి చదువులే. ఈ పొట్టను నింపుకోవటానికి మానవుడై పుట్టాలా? పశువులు తమ పొట్టలను నింపుకోవటం లేదా? మనకు పొట్ట కాదు ప్రధానము. గుణములు ప్రధానము.

ఈనాడు అనేక రకములైన 'సిలబస్' లను మనం మారుస్తున్నాం, ఎన్ని మార్చిన కూడనూ ప్రయోజనం లేదు. దేశాన్ని మార్చినంత మాత్రమున ప్రయోజనం లేదు రూపాలు మార్చినంతమాత్రమున ప్రయోజనం లేదు ఆర్థికంగా మార్పులు వచ్చినంత మాత్రమున ప్రయోజనం లేదు. రాజకీయంగా మార్పులు వచ్చినంత మాత్రమున ప్రయోజనం లేదు. మనసు మారాలి. మనసు మారినప్పుడే మనిషి మారుతాడు. మనిషి అంటే ఎవరు? మనసే మనిషి. మనసు లేనటువంటివాడు మనిషే కాదు. మొట్టమొదట మనసు మార్చుకున్నప్పుడే దేశమంతా మారిపోతుంది అప్పుడు సమాజాన్ని ఎంతో ఆనందంగా తీర్చిదిద్దవచ్చు నీ మనసులో మాలిన్యముంచుకొని, ఎన్ని విధములైన ప్రచార ప్రబోధలు చేసినప్పటికినీ, అవి ఏమాత్రం ఫలితమును అందించవు. నీవు అనుభవించి, ఆచరించి నీవు ఇతరులకు బోధించాలి.

నిజమైన విజ్ఞానమంటే ఏమిటి? దేశ శ్రేయస్సును కోరాలి. ప్రజాక్షేమాన్ని కోరాలి. జనుల మనస్సులను మార్పు చేయాలి ఐకమత్యాన్ని పెంచుకోవాలి అప్పుడే నిజమైన Unity ఆ Unity వచ్చినప్పుడే Purity ని పెంచుకుంటాం ఈ Unity, Purity రెండూ చేరినప్పుడే Divinity వచ్చేస్తుంది. ఈనాడు unity లేదు, Purity లేదు, Divinity [illegible]కన్నా లేదు. కేవలం Community ని [illegible] పట్టుకున్నారు ఈ Community తోనే ఇన్ని అల్లకల్లోలాలు వస్తున్నాయి అందరూ మానవులమే, అందరమూ భగవంతుని బిడ్డలమనే సత్యాన్ని గుర్తించాలి. ఈ విధమైన భేదాలను ప్రక్కకు పెట్టండి మీ సంప్రదాయాలను మీ ఇంట్లో చూచుకోండి. బయటకు వచ్చి ఇది నా సంప్రదాయమని పోరాడుతే నీవు మూర్ఖుడవైపోతావు. అందరిదీ ఒకే మతము. అదే మానవమతం. అందరికీ ఒకే భాష. అదే హృదయభాష. ఆ విధమైన ఏకత్వాన్ని మనం పెంచుకోవాలి.

విద్యార్థులారా! భావిభారతపౌరులారా!

దేశం యొక్క మంచిచెడ్డలన్నీ కూడనూ మీపై ఆధారపడివున్నాయి. మీరు మంచివారైనప్పుడే దేశం

మంచిగా మారుతుంది. అప్పుడే మీ భవిష్యత్తు ఉజ్జ్వలముగా ఉంటుంది, దేశం అభివృద్ధి కాగలదు. ఈనాటి మీ మంచి ప్రవర్తన వలననే భవిష్యత్తులో మీరే నాయకులు కాగలరు. Leader కావల్సినవారు మంచి ఆదర్శమును అందించాలి ఈ విధంగా మన విద్యార్థులందరూ, ఒక్కొక్కరు ఒక్కొక్క పవిత్రమయిన ఆదర్శమైన జ్యోతిగా తయారుకావాలి. అప్పుడే దేశం బాగుపడుతుంది. దేశము యొక్క బేధాలనుకూడా మీరు పాటించకండి ప్రపంచమంతా ఒక పెద్ద గృహం. ఒక్కొక్క ఇంట్లో ఒక్కొక్క గది వుండినట్లుగా ఒక్కొక్క దేశం వుంటున్నది. "లోకా స్సమస్తా సుఖినోభవంతు". అందరూ క్షేమంగా వుంటుండాలి. దేశములవారూ మానవులే. అన్ని దేశముల సుఖ శాంతులను అనుభవించాలి విశాలమైన హృదయాన్ని పెంచుకోవాలి. ఇతర దేశములు ఏమైపోయినాసరే మా భారతదేశం మాత్రం బాగుంటే చాలు అనుకుంటే, ఇంతకంటే స్వార్థమూ, సంకుచితత్వమూ వేరొకటి వుండదు నీ దేశము యొక్క సుఖాన్ని, సంతోషాన్ని నీవు ఏవిధంగా ఆశిస్తుంటావో, ఇతర దేశముల సుఖసంతోషాలను కూడా ఆ విధంగా నీవు ఆశించాలి. ప్రాచీన ఋషులు వేసిన ఈ విత్తనములను మనం వృక్షములుగా చేసుకొని, ఫలములను అనుభవించడానికి తగిన కృషి చేయాలి. ఫలాలు కావాలి గాని పోషణ మాత్రం చేయరు ఎట్లాచిక్కుతాయి? ఒక షాపుకు వెళ్లి తగిన డబ్బు యిస్తేనే జేబురుమాలా యిస్తాడు. తగిన ధర యివ్వకపోతే యివ్వడు. అదే విధముగా నీలో వున్న దుర్గుణాలను నీవు త్యాగం చేయాలి. సద్గుణాలను భగవంతుని నుండి నీవు పొందాలి భగవంతుడు ఒక Shop keeper నీవు దేనిని కోరుతావో, దానికి తగిన విలువ యివ్వాలి. అది యివ్వకుండా ఆశిస్తే, అది One-way Traffic. అవుతుంది Give & Take, Give & Take వుండాలి. ఎవరి ప్రేమనయినా నీవు పొందాలనుకుంటే, మొట్టమొదట నీ ప్రేమను వారికి అందించు. నీవు నీ ప్రేమను అందించకుండా, ఇతరుల

## శ్రీవాణి కి సన్మానం

ది 2-10-93 గాంధీజయంతి సందర్భమున ఆంధ్రప్రదేశ్ చిన్నపత్రికల సంఘ ఆధ్వర్యమున శ్రీవాణి మాసపత్రిక సంపాదకులు శ్రీ కొమతగిరి కృష్ణమోహనరావుగార్ని గుంటూరులో సన్మానించినారు. ఈ సందర్భమున "భారతీయమార్గం", "అర్క", "సాయిబాబా", "అవతార్ మెహర్‌బాబా", "ఆస్తికభూమి", "గాయత్రిపరివార్" పత్రికల సంపాదకులను కూడా సన్మానించడమైనది. పౌరసంబంధాల అధికారి శ్రీ రావుల సూర్యనారాయణమూర్తి గారు ముఖ్య అతిథిగా పాల్గొనినారు. శ్రీయుతులు గ్రంధి సుబ్బారావు (కేపిన్ వక్క-పొడి) నందమూరి సత్యనారాయణరావు (అధ్యక్షులు), పోతుకూచి సాంబశివరావు (గౌరవాధ్యక్షులు) కె. వి. పున్నారావు, యస్ కె. బాజి ప్రభృతులు ఆధ్యాత్మికరంగంలో ఈ పత్రికలు చేస్తున్న విశిష్ట సేవను ప్రశంసించినారు ఈ సన్మాన కార్యక్రమాన్ని నిర్వహించిన చిన్నపత్రికల సంఘంవారికి అభినందనలు.

– మేనేజర్

ప్రేమ రావాలనుకుంటే ఎట్లా వస్తుంది. మానవుని యొక్క జీవితం Heart to Heart, Love to Love. ఇది పదార్థములతో కూడినటువంటిది కాదు కనుక పిల్లలలో చిన్నప్పటినుంచే సరియైన బుద్ధిని, గుణమును పెంచడానికి తగిన కృషి చేయాలి. ఆ నిమిత్తమై మనం ఈనాడు ఒక విద్యాసంస్థను ఏర్పర్చినామేగాని, ప్రపంచంలో ఎన్నో విశ్వవిద్యాలయములు లేకపోలేదు కాని పవిత్రమైన గుణమును విద్యార్థులలో

## సవరణ

నవంబర్ '93 శ్రీవాణి సంచికలోని 45 వ పేజీలో భగవాన్ బాబావారి జాతక చక్రంలో జన్మదినం 23-11-1921 అని అచ్చు పొరపాటు పడింది. బాబావారి జన్మదినం 23-11-1926 గా గమనించ ప్రార్థన.

శ్రీ సత్యసాయి శతకము 47 వ పేజీలో "సత్కర్మ" (God work) అని అచ్చు పొరపాటు పడింది Good work అని గమనించగలరు. అదే పేజీలో Service తరువాత is అని పడింది. To అని గమనించ ప్రార్థన.

— సం.

పెంపొందించాలనే ఉద్దేశ్యంతో ఈ విద్యా సంస్థను స్థాపించాం.

లోకులు కాకులు. కాకులు కూస్తున్నాయని కోకిల తన గానమును తాను మానుకుంటుందా? హంసను చూచి కొంగలు పరిహసిస్తుంటే హంసకు తగ్గే విలువేమిటి? ఏనుగు పోతుంటే కుక్కలు మొరుగుతుంటాయి. ఏనుగుకు ఏమి భయమవుతుంది? కాబట్టి ఎవరేమనుకున్నప్పటికినీ మన సత్యంపై మనం ఆధారపడాలి. సత్యమే మన ప్రాణం. భారతీయ సంస్కృతిలో "సత్యం వద, ధర్మంచర" ఈ రెండింటిని మనం రెండు చక్రాలుగా తీసుకుంటే, రెండు రెక్కలుగా తీసుకుంటే, మన జీవితం ఉన్నతస్థాయికి పోతుంది. సత్యాన్ని ఆశ్రయించినదే ధర్మం. ధర్మమును ఆధారము చేసుకొనినదే సత్యం. ఇవి రెండూ Negative, Positive లాంటిది. ఈ రెండింటియొక్క ఏకత్వమే మానవత్వము. ఇతరులు ఏమైనా అనుకుంటారని సిగ్గుగాని, భయముగాని, భీతిగాని ఉండకూడదు. సత్యవంతునికి భయమే లేదు. భార్యను అమ్ముకున్నాడు, కుమారుని చంపుకున్నాడు. స్మశానంలో కాటికాపరిగా నిలిచాడు కాని సత్యాన్ని వదలలేదు. అందుకే అతనికి "సత్య హరిశ్చంద్రా" అని పేరువచ్చింది. కనుక మనం సత్య మార్గంలో జీవించాలి. అసత్య మార్గములో సంపాదించింది అసత్యంగానే పోతుంది. అన్యాయంగా వచ్చిన డబ్బును మనం ఏం ప్రయత్నించినా నిలుపుకోలేం. ఏదైనా ఒక మంచి పని చేయండి. విద్యా సంస్థనో, ఆరోగ్య సంస్థనో ఏర్పాటు చేయండి. ఆసుపత్రులు కట్టండి. రోగులకు మందులు అందించి రోగ నివారణ చేయండి. అయితే ఈనాడు ఆసుపత్రులు దండిగా కడుతున్నారు. పది కోట్లుపెట్టి ఆసుపత్రి కట్టి నూరుకోట్లు ఆదాయం రావాలని ఆశిస్తున్నారు. ఇదంతా వ్యాపారం ... వ్యాపారం డబ్బువస్తే మంచి పని చేయండి సంపాదన అన్యాయం కాదు త్యాగం ... త్యాగం ... కావాలి ఈ సత్యాన్ని గుర్తించాలి.

విద్యార్థులు ఏ దేశమైనా వెళ్ళండి, ఏ పనిలోనైనా ప్రవేశించండి, చదువుమాత్రం మానకుండావుండండి. విద్య విశిష్ఠతను మాత్రం హృదయంలో ముద్రించుకోవాలి. పెడ మార్గమున మాత్రం పట్టకండి. సత్య మార్గమును విడువకండి. ధర్మాన్ని అనుసరించండి. ప్రేమను పెంచుకోండి. అహింసను నిలబెట్టండి. అదే నిజమైన ప్రబోధ. ఏదో ఒక కాన్వొకేషన్ జరుగుతున్నదని ఒక కాగితం (సర్టిఫికేట్) తీసుకొని పోయి ఆఫీసులచుట్టూ తిరుగుతూ ఉద్యోగం ... ఉద్యోగం అని Beg చేయకండి. మేము యిచ్చేది Beg చేయటానికా? ఇలా Beg చేయకండి. మీరు Beggears కాకూడదు. Biggers కావాలి [గొప్ప ఆదర్శమును] చూపించినప్పుడే మీరు Biggers అవుతారు. ఈ విధమైన సన్మార్గములో మీరు ప్రవేశించి, దేశానికి సేవ చేస్తూ, మీ జన్మను సార్థకం చేసుకుంటారని నేను ఆశిస్తూ, ఆశీర్వదిస్తూ నా ప్రసంగాన్ని విరమిస్తున్నాను.

(ప్రశాంతినిలయంలో ది 22-11-93 న జరిగిన 12వ స్నాతకోత్సవ సభలో భగవాన్ బాబావారు చేసిన దివ్య ప్రసంగము నుండి).

మొరపెట్టుకొని, తినవద్దని పిల్లవానికి చెప్పమని రామకృష్ణ పరమహంసను కోరిందట. పరమహంస వారం రోజులైనా నోరు మెదపలేదు. తరువాత ఒక పర్యాయం ఆ కుర్రవానిని పిలిచి మిఠాయిలు తినవద్దని నచ్చజెప్పాడుట. ఈ విషయాన్ని వెంటనే ఎందుకు చెప్పలేదని తల్లి అడిగింది. అప్పుడు రామకృష్ణ పరమహంస "మిఠాయి అంటే నాకూ ఇష్టమే. వాటిని తినటం మానివేసిన తరువాత ఇప్పుడు చెబుతున్నాను. ఆచరించకుండా చెప్పడం మంచిదికాదు" అని అన్నాడు. కనుక అవతారపురుషులు, శ్రేష్ఠులు, ఆచరించనిదే బోధించరు. ఇదే వారి ప్రత్యేకత.

" న మే పార్థాస్తి కర్తవ్యం
త్రిషు లోకేషు కించన
నానవాప్తమవాప్తవ్యం
వర్త ఏవ చ కర్మణి "

" ఓ అర్జునా ! నాకు ఈ మూడు లోకములందును చేయవలసినపని ఏ కొంచమయిన లేదు. పొందబడనదియు, పొందవలసినదియు, ఏదియును లేదు. అయినను నేను ఆదర్శవంతమైన కర్మయందు ప్రవర్తించుచునే యున్నాను (చేస్తున్నాను)" అని శ్రీకృష్ణపరమాత్మ చెప్పారు. ఈ మాటలు ఈనాటితరం వారికి వింతగానే కనిపించవచ్చు, వినిపించవచ్చును. అవతారపురుషులకు ఏమీ అవసరం లేకపోయినప్పటికీ ప్రజలను సక్రమమైన మార్గంలో పెట్టటానికోసం వారు ఆదర్శవంతమైన జీవితాన్ని గడుపుతుంటారు. వారు నిజమైన నిష్కామ కర్మయోగులు. అవతారపురుషులు ఆ విధంగా ఎందుకు కర్మ చేయాలో శ్రీకృష్ణపరమాత్మ స్పష్టం చేశారు.

" ఉత్సీదేయురిమే లోకా
న కుర్యాం కర్మ చేదహమ్
సంకరస్య చ కర్తా స్యాం
ఉపహన్యామిమాః ప్రజాః "

" నేను కర్మను ఆచరించని యెడల ఈ ప్రజలు భ్రష్టులగుదురు, చెడిపోవుదురు. సంఘమునందు ఏర్పడు సంకరమునకు నేనే కారకుడనగుదును. ప్రజలను నేనే చెడగొట్టినవాడనగుదును" అని శ్రీకృష్ణ పరమాత్మ చెప్పారు. ఎందువలన? పైన ఉన్నవారు బాధ్యతలను నిర్వహించేవారు, పాలకులు, నాయకులు గనుక వారి వారి విధ్యుక్తధర్మాలను సరిగా నిర్వర్తించకపోతే, వారి క్రిందవారు కూడా బాధ్యతారహితంగా ప్రవర్తిస్తారు. వ్యవస్థ అవస్థలో పడుతుంది. అధికారంలో నున్నవారే వారి వారి కర్మలను ఆచరించనప్పుడు మేమెందుకు ఆచరించాలనే మనస్తత్వం క్రిందివారిలో ప్రబలుతుంది. ఉదాహరణకు ఒక ఆఫీసులో మేనేజర్ తన విధులను సక్రమంగా నిర్వర్తించకుండా, సెలవలు కూడా పెట్టకుండా "గైర్ హాజర్" అవుతుంటే క్రింద గుమాస్తాలుకూడా ఆ విధంగానే ప్రవర్తిస్తుంటారు. వారిని మందలించే నైతికమైన హక్కును మేనేజర్ కోల్పోతాడు. కర్తవ్య పాలన వలన అర్హత లభిస్తుంది. అర్హత గలవారికే అడిగే హక్కు ఉంటుంది. శ్రీకృష్ణుడంతటివాడు అర్జునుని రథమునకు సారథ్యం వహించడానికి అంగీకరించాడు. సాక్షాత్ పరమాత్మ అయినప్పటికీ గుఱ్ఱములకు "మాలిష్" చేసేవాడుట. స్వయంగా వాటిని కడిగేవాడుట.. ఈ పని చేయటానికి సేవకులు లేరని కాదు. శ్రీకృష్ణుడు తన విధ్యుక్త ధర్మాన్ని తానే నిర్వర్తించి చూపాడు. ఇక్కడ అదే విశేషము. సామాన్యులకు అనుకోకుండా సిరిసంపదలు వచ్చి మీదపడితే, ఊహించని అధికారం వస్తే, కలనైనా గాంచని ఉన్నత పదవులు లభిస్తే...అట్టివారు తమ గతాన్నే విస్మరిస్తారు. క్రిందివారిని ఈగలు, దోమలకన్నా హీనంగా చూడటం పరిపాటి అవుతుంది. ఇవన్నీ నడమంత్రపు సిరులు కొన్నాళ్ళు

"దేవుడు వరమిచ్చినా పూజారి వరమివ్వడు" అనే సామెత అనాదిగా వస్తున్నది. ఇది ఎంతో అనుభవంతో చెప్పిన మాట. అనేకమంది పూజారుల అక్రమ, నిరంకుశ ప్రవర్తన వలన ఎంతోమంది భక్తులు హృదయవేదనకు గురియైన సంఘటనలు కోకొల్లలు. అంతేకాదు అనేక కష్టనష్టాలకు గురియై భౌతికమైన శరీరాన్నే విడిచి పరమాత్మలో లీనమైనవారూ వున్నారు, అంతటి ఆత్మవిశ్వాసంలేని అభాగ్యులు దైవంమీద విశ్వాసమును కోల్పోయిన నిర్భాగ్యులూ వున్నారు. అంతేకాదు రాజు మంచివాడైనప్పటికీ, అతని మంచిని ఆసరాగా తీసుకొని క్రింద అధికారంలోవున్న మంత్రులు,

సేనాధిపతులు అవినీతి, అక్రమపాలన చేయటం వలన ఆ దేశ ప్రజలు విసిగి వేసారిపోయిన సంఘటనలు ఎన్నో ఉన్నాయి. చేతకాని బలహీనులు తలలొంచారు, చేతనైనవారు తిరుగుబాటు చేశారు ఇటువంటి ఉదంతాలు చరిత్రలో ఎన్నో కనిపిస్తాయి గతచరిత్రను పరిశీలిస్తే చక్రవర్తులు, రాజులు, ప్రవక్తలు, పీఠాధిపతులు, మఠాధిపతుల పేరుప్రతిష్ఠలు, వరిక్రింద Key Positions లో పనిచేసే వ్యక్తులమీదనే హెచ్చు భాగం ఆధారపడి వుండినట్లుగా గోచరిస్తున్నది నేటి ప్రజాస్వామ్య వ్యవస్థకూడా అదే ఋజువు చేస్తున్నది దీనికి కారణమేమిటి ? కారకులెవరు ? పరిశీలిస్తే ఒక విషయం తేటతెల్లమవుతుంది. సామ్రాజ్యాలలోగాని, ప్రజాస్వామ్యంలోగాని,సంస్థలలోగాని వ్యవస్థలలో విధాధ్యతలను నిర్వహించే నిర్వాహకులు తమ విద్యుక్తధర్మాన్ని సక్రమంగా నిర్వహించకపోవటంవలననేసామ్రాజ్యాలు సర్వనాశనం అయిపోయినాయి, ప్రజాస్వామ్య ప్రభుత్వాలు పతనమైపోతున్నాయి, సంస్థలు నామరూపాలు లేకుండాపోతున్నాయి, వ్యవస్థలు అవస్థలోపడి కనుమరుగైపోతున్నాయి. ఈ గత అనుభవాలను వర్తమానంవారు, భవిష్యత్తరాలవారు గుర్తించి వర్తించాలి

ఈ పతనానికి కారణం ఏమిటి ? మానవుడు 'అ'కార పంచకమనే దుర్గుణాలకు దాసోహం కావటంవలన పతనమవుతున్నాడు, తనతోపాటు తన సంస్థను వ్యవస్థను కూడా సర్వనాశనం చేస్తున్నాడు. 1. అధికారం 2. అవినీతి 3. ఆశ్రిత పక్షపాతం 4. అహంకారం 5. అక్రమపాలన– ఈ ఐదింటి సమ్మిళిత స్వరూపమే 'అ'కార పంచకం. ఈ ఐదు దుర్గుణాలు ప్రతి సంస్థలో యీనాడు కనిపిస్తున్నాయి చిట్టచివరికి పరమ పవిత్రంగా ఉండవలసిన ఆధ్యాత్మిక సంస్థలలో కూడా ఈ 'అ'కార పంచకం ప్రవేశిస్తున్నది. చేతులు కాలిన తరువాత ఆకులు పట్టుకుంటే ప్రయోజనం లేకపోగా ప్రమాదంకూడా ఏర్పడుతుంది. కనుక వీటికి అవకాశం యివ్వకుండా ప్రతి సంస్థ ముందుగా జాగ్రత్తపడాలి. " Power corrupts, absolute power corrupts, corrupts " అన్నారు గదా ! అధికారం అవినీతిని పెంచుతుంది. అవినీతి ఆశ్రితపక్షపాతానికి దారితీస్తుంది. ఈ మూడూ (అధికారం, అవినీతి, ఆశ్రిత పక్షపాతం) కలిస్తే మానవునిలో అహంకారం ప్రబలుతుంది. ఇట్టి అహంకారంతో అక్రమపాలనకు వడిగడుతాడు. దాంతో ఆ సంస్థ అప్రదిష్ట పాలవుతుంది 'అ'కారపంచకమే అన్ని అనర్థాలకు మూలం కనుక నిర్వాహకులు ఈ 'అ'కార పంచకమునకు ఏమాత్రం అవకాశం యివ్వరాదు. సంస్థలయొక్క పేరుప్రతిష్ఠలు గాని, అప్రదిష్టలుగాని, ఆ సంస్థల నిర్వాహకులమీదనే ఆధారపడి వుంటుందనే నగ్నసత్యమునువిస్మరించరాదు.

"ప్రేమ" ఒక్కటే ఈ 'అ'కార పంచకములను సంహరించగల ఆయుధం ప్రేమ ఎక్కడో వుంటుందో అక్కడ ఈ "అ"కార పంచకమునకు స్థానమేఉండదు. కనుకనే భగవాన్ బాబావారు "ప్రేమ చేతనే ప్రపంచమంతా ఒకటిగా మారుతుంది. ప్రేమలేని జీవితం శవంతో సమానమే. ప్రేమ ఉండినప్పుడే సత్యమును పలుకుతావు, ధర్మమును ఆచరిస్తావు, శాంతమును అనుభవిస్తావు, అహింసను పాటిస్తావు వీటన్నిటియందు ప్రేమయే అంతర్వాహిణి ఆ ప్రేమయే ప్రతి మానవుని కట్టివేసి ఏకత్వంగా నిరూపిస్తున్నది. ఈ ప్రేమతత్త్వము హృదయమునుండి ఆవిర్భవించాలి. అప్పుడే నిజమైన ఏకత్వం సంభవిస్తుంది. అయితే ఈనాడు మన ప్రేమను పదిమందికి పంచడం లేదు. ఇచ్చుకోవటంలో మనం " జీరో!" పుచ్చుకోవటంలో మనం "హీరో!" అన్నారు స్వామి చెప్పే ప్రతి మాట వెనుక ఎంతో అంతరార్థముంటుంది వాటిని తర్కించాలి, మననం చేయాలి, ఆచరణలో పెట్టాలి ముఖ్యంగా నిర్వాహకులు కడు జాగరూకతతో వ్యవహరించాలి. కేవలం బాబావారు చెప్పే ప్రసంగాలను విని పోతే ప్రయోజనం లేదు ఆచరణలో పెట్టకుండా ఎన్ని ప్రసంగాలు వినినా ఫలితం శూన్యం. ఆచరణలో పెడుతూ, ఆదర్శవంతమైన జీవితాలను గడుపుతూ బాబావారు బోధించే 'ప్రేమస్వరూపులారా!' అనే పదానికి విలువను, శోభను, పవిత్రతను ఇనుమడింపజేద్దాం. ఇదే ఈనాటి భక్తుల కర్తవ్యం. ○